# [illegible]పసినిగోటు

## ఒకటవ అంకము

### ఒకటవ రంగము

(సుదర్శనం, సుందరి)

సుదర్శనం:- ఏమిటి సుందరీ, ఎందుకు విచారపడుతున్నట్టు ఉన్నావు! ఇప్పుడేగా, నన్ను ప్రేమిస్తున్నానని చెప్పావు. నేనీ సంతోషంలో మునిగి తేలుతూంటే నీవు విచారంగా ఉంటే ఎలా! నాకింత సంతోషం కలిగించి నువ్వు సంతాపపడుతున్నావా? పెండ్లి చేసుకొంటానని చెప్పే కానే అని పశ్చాత్తాపపడుతున్నావా!

సుందరి:- లేదు సుదర్శనం! నీ కోసం చేసిన పనికి దేనికి నేను విచారపడను. ఏదో రమ్యమైన ఒకశక్తి నన్ను నీవైపుకు బలవంతంగా లాగుతున్నది. జరిగిన దేదో జరగకుండా ఉంటే బాగుండేది అనికూడా అనిపించడంలేదు. కారా యిది ఎలా పరిణమిస్తుందోనని భయంగాఉంది. నిన్ను ఇంకా ఎక్కువగానైనా ప్రేమించగలను. కాని, ఎందుకో భయంగా ఉంది.

సుద:- నన్ను ప్రేమిస్తూ ఉండడంలో భయమేమున్నది సుందరీ?

సుం:- ఒక్కటేమిటి. అన్నీ భయాలే. మా తండ్రికి కోపం వస్తుందని ఒకటి, కుటుంబానికి చెడుపేరు వస్తుందని ఒకటి, లోకం యేమంటుందోనని ఒకటి. వీటన్నిటికన్నా ఇంకొక పెద్దభయం ఉన్నది. మొగవాళ్లని నమ్మరాదంటారు. నీకు నామీద ఎప్పుడూ ఇంత ప్రేమా ఉంటుందా, అని ఒకటి.

సుద:- నన్ను అలాంటి వాళ్లతో పోల్చి సంశయిస్తున్నావా? సుందరీ! నేను అందరి వంటివాడనే నంటావా? నన్నే విషయంలో అనుమానించినా అనుమానించుగాని, నా ప్రేమని గురించి మాత్రం అనుమానించకు. నా ప్రేమ ఎంతపవిత్రమైనదో నీవెరుగవు. ఈ జన్మలో అది తరగదు.

సుం:- అంతా అలాగే అంటారు. మాటల్లో మగవారంతా వకటే. ప్రవర్తనల్లోనే తేడా.

సుద:- అల్లా అయితే ప్రవర్తనకూడా పరీక్షించేదాకా ఓపికపట్టు. లేనిపోని భయంవల్ల ఉన్నవి లేనివి కల్పించుకొని బాధపడకు నీ అనుమానాలతో మాత్రం నన్ను బాధపెట్టకు. నా అనురాగం నిశ్చలమైనదనడానికి నీకెన్ని నిదర్శనాలైనా చూపించగలను. ఓపికపట్టు.

సుం:- అలాగే. ప్రేమ ఉంటే విశ్వాసానికి లోటేమున్నది. నీ ప్రేమ స్థిరమైనదనీ, నీలో మార్పు ఎన్నడు రాదనే అనుకుంటున్నాను. ఎన్నడు నిన్ను అనుమానించను.

కాని లోకులు ఏమనుకుంటారో అనే విచారం మాత్రం వదలకుండా ఉంది.

సుద:- అదిమటు కెందుకు సుందరీ ?

సుం:- లోకం నాకళ్లు పెట్టుకొని నిన్ను చూస్తే నాకేమి భయంలేదు. నాకు మాత్రం నిన్నుచూస్తేనే చాలు, నేను చేసేది మంచిపనేఅన్న ధైర్యం కలుగుతుంది. మననిద్దరిని కూర్చినది దేవుడేనని నా నమ్మకము. మనమిద్దరం మొదట ఏ మహోపద్రవస్థితిలో కలుసుకున్నామో ఆ దృశ్యం యెప్పుడూ నా కళ్లకు కట్టినట్టుంటుంది. ఆ సముద్రంలోనుంచి నీ ప్రాణాలుకూడా లెక్కచెయ్యక నన్ను రక్షించడం, ఒడ్డుకు చేరిన తరువాత చూపిన దయ, అప్పటినుంచి నా మీద కనబరుస్తూన్న అనురాగం, మీ దేశమైనా తలపెట్టక నాకోసం ఇక్కడ ఉండి పోవడం, అంతేకాకుండా, నన్ను విడువలేక మారు వేషంతో మాయింట నౌకరుగా ఉండడం, ఇవన్ని మరచిపోవాలంటే మాత్రం ఎలా మరచిపోగలను. నిన్ను ప్రేమించకుండా ఎలా ఉండగలను.

సుద:- నిన్ను రక్షించానని గాని, నీ కోసం మారువేషంతో తిరుగుతున్నానని కాని నన్ను ప్రేమించవద్దు. నాకు నీ పైగల గాఢమైన అనురాగం మాత్రమే గమనించి నన్ను ప్రేమించమని కోరుతున్నాను. లోకానికి భయ పడుతున్నానంటున్నావుకదూ ? నీ కాభయమక్కర

లేదు. మన నడవడి మంచిదని లోక మనుకునేలాగ మీ నాన్నే చేస్తున్నాడు. ఆయన మిమ్మల్ని పెట్టే అగచాట్లు చూస్తే మీ రేమిచేసినా లోకం హర్షిస్తుంది. ఇట్లా మాట్లాడుతున్నానని అనుకోకు. మీ నాన్నను గురించి మంచి చెప్పడం మానవమాత్రుడికి సాధ్యం కాదు. అందుకనే మా వాళ్ల జాడ ఏమన్నా తెలుస్తుం దేమో చూచివద్దామని బయలుదేరుతున్నాను. వాళ్లు కనపడితే యీ బాధ లేవీ లేకుండా హాయిగా ఉండ వచ్చు. రెండు మూడు రోజులలో వాళ్లజాడ తెలియక పోతే నేనే వెళ్లిపోవాలనుకుంటున్నా.

సుం:- అమ్మయ్యో, వద్దు ఇక్కడనుంచి వెళ్లొద్దు. ఇక్కడే ఉండి మా నాన్నను వశంచేసుకొనే ఉపాయం ఆలోచించండి.

సుద:- నీవే చూస్తున్నావుగా, మీ నాన్న మెప్పు పొందా లని యెంత వినయ విధేయతలతో నడుచుకుంటు న్నానో. ఎన్ని యిచ్చకాలు పలుకుతున్నది, ఎన్ని ఆటలాడుతున్నది నీకు తెలుసు. ఈ నాటకం అంతా చక్కగానే ఆడుతున్నాను. అన్నీ అనుకొన్నట్టు జరుగు తున్నాయి. ఎవరి అనుగ్రహమైనా సంపాదించాలంటే ఏం చెయ్యాలో నేర్చుకున్నాను. వాళ్ల అభిప్రాయమే మన అభిప్రాయంగా కనపడాలి. వాళ్ల మాటలన్నిటికి పక్కతాళం వెయ్యాలి. వాళ్లకున్న లోపాలను సుగు ణాలని వర్ణించాలి. మరీ స్తోత్రంచేస్తే బయటపడమా

అంటావేమో, ఏమి భయంలేదు. ఎంత తెలివిగలవా ళ్లైనా, స్తోత్రపాఠానికి ఇట్టే లోబడతారు. గొప్పవాళ్లకే యీ తెగులెక్కువ. నీవు యేమి చెప్పు, ఎంత అసం దర్భంగా చెప్పు, ఎంత తెలివితక్కువగా చెప్పు, వాళ్లను పొగుడుతూ చెపితేచాలు, వింటారు. స్తోత్రం చెయ్యడం అంత మంచిది కాకపోవచ్చు, కాని మీ నాన్నలాంటి వాళ్లను సాధించాలంటే యింకో మార్గంలేదు. ఇంతకీ కార్య సాధనకు స్తోత్రం చేస్తే, చేసేవాడిది కాదు తప్పు-చేయించుకొనేవాడిది.

సుం:- నిజమే, అయితే మా అన్నతో అంతా చెప్పి మనకు సహాయం చెయ్యమంటే యేం! ఇంతవరకు మన గుట్టు మా దాసీదానికి మాత్రమే తెలుసు. అది యెన్నాళ్లు కాపాడుతుంది ? బయటపడితే ప్రమాదం గదా.

సుద:- సరే, ఒకరితోనే వేగలేకుండా వుంటే ఇద్దరితోనా. మీ నాన్నదారి ఒకటి, మీ అన్నదారి ఇంకొకటి. ఒకటి తూర్పు, ఒకటి పడమర. ఇద్దరిని పట్టుకురావడం నావశం కాదు. కాని, నీ వంటే మీ అన్నకు ఇష్టమే లాగుంది. నీవే చెప్పి మనకు సహాయకారిగా ఉండేటట్లు చూడు. అదుగో వస్తున్నాడు. నేను వెళతా, సమయం కనిపెట్టి మాత్రం చెప్పు. (నిష్క్రమిస్తాడు)

సుం:- ఏమోనబ్బా, మా అన్నతో చెప్పాలన్నా నాకు భయం గానే ఉంది. (చక్రపాణి ప్రవేశం)

# రెండవ రంగము

(చక్రపాణి, సుందరి)

చక్రపాణి:- నువ్వు వంటరిగా యెక్కడ కనబడతావా అని తహ తహ లాడుతున్నా. నీ కొక గొప్ప విషయం చెప్పాలమ్మా.

సుం:- చెప్పన్నయ్యా! ఏమిటది?

చక్ర:- చెప్పడం మొదలుపెడితే చాలా ఉందిగాని, ఒక్క మాటలో చెప్పాలంటే - నేనొక ప్రేమ కలాపంలో చిక్కుకున్నా.

సుం:- ప్రేమకలాపమా?

చక్ర:- ఔనుకాని, - నాకు నువ్వేమీ చెప్పకు! నేను నాన్న మీద ఆధారపడి ఉన్నానని తెలుసు. ఆయన ఆజ్ఞ శిరసా వహించాలని తెలుసు. అయన ఒప్పుదలలేనిదే ఎవరిని పెండ్లి చేసుకోకూడదని తెలుసు. యీ వివాహ విషయాలలో మనకంటే పెద్దవాళ్లకు అనుభవం యెక్కువ గనుక వారు చెప్పినట్లు చేయడమే మనకు క్షేమమని కూడా తెలుసును. ఇవన్నీ నీవెట్లాగూ చెబుతావు గనుక నీకాశ్రమ లేకుండా నేనే చెప్పాను. నా కివేమీ చెవినిబట్టవు కాబట్టి నువ్వు చెప్పి లాభంలేదు.

సుం:- ఆ అమ్మాయిని పెండ్లి చేసుకుంటానని మాట యిచ్చావా?

చక్ర:- ఇంకా యివ్వలేదుగాని యివ్వడానికి నిశ్చయించుకొన్నాను. నాకేమి అడ్డం చెప్పవద్దు.

సుం:- నీకు అడ్డం చెపుతానా, అన్నయ్యా.

చక్ర:- లేదమ్మా, నీకు ప్రేమంటే యింకా తెలియదు గనుక, అది మనుష్యుల హృదయాలను యెంత తొందర పెట్టుతుందో యెరుగవు గనుక, ఏమి బుద్ధులు చెప్పుతావో నని సందేహించాను.

సుం:- బుద్ధులు చెప్పేటట్లే ఉన్నది నాసంగతి! ఎటువంటి వారైనా, ఎప్పుడో ఒకప్పుడైనా, ఆ స్థితిలో పడనివారెవరన్నయ్యా? నా మనస్సు విప్పి చెపితే తప్ప అసలు నా అవస్థ ఎలా ఉందో నీకేం తెలుస్తుంది.

చక్ర:- అట్లా అయితే నీవుకూడా.........

సుం:- సరే, ముందు నీకథ కానీ, ఆ పిల్ల యెవరు?

చక్ర:- మన వీధి చివరి ఇంట్లోకి యీ మధ్యనే వచ్చారు. అటువంటి పిల్ల, ఆ అందం, యోగ్యత సృష్టిలో లేదు ఆమెను చూచిన వెంటనే నా హృదయం ఆమె వశమై పోయింది. పేరు చారుమతిట. తల్లిచాటు పిల్ల. ఆ తల్లి

పాపం యేదో వ్యాధి. ఆమెకు యెంత ఉపచారం చేస్తుందనుకున్నావు? పసిపిల్లకు చేసినట్టు చేస్తుంది. పనులు చేస్తు యింట్లో తిరుగుతుంటే మహాలక్ష్మిలాగ ఉంటుంది. ఆ నెమ్మది, ఆ నేర్పు, ఆ ఉత్సాహం, చూసితీరాలి.

సుం:- చూడక్కరలేదు. నీవు చెప్పుతుంటే ఎదురుగుండా చూస్తున్నట్టే ఉంది. నీవు ప్రేమించావంటే నాకు తెలుసు, ఆమె సుగుణవతి అయి ఉండాలి.

చక్ర:- కాని, పాపం వాళ్లు ఆట్టే కలవాళ్లుగారు. కష్టంమీద జీవనం గడుపుతున్నారని తెలిసింది. వాళ్లకు కాస్త సహాయం చేయగలిగితే యెంత బాగుండును. నాన్న చూద్దామా ఇల్లాంటి వాడయాడు. మనకు మంచి రోజులు ఎప్పుడు రావనుకుంటాను. ఇంత ఉండి యేం లాభం ? అనుభవించలేకపోయిన తరువాత.

సుం:- అవు నన్నయ్యా, నీవెంత బాధపడుతున్నావో నేను గ్రహించగలను.

చక్ర:- నేపడేబాధ నీకేమి తెలుసునమ్మా? మనం బ్రతుకుతున్నంత నీచంగా ఎవరైనా బ్రతుకుతున్నారా ? ఎందుకీ పిసిని గొట్టుతనం ! ఎప్పుడో డబ్బు చేతికి వస్తుందంటే ఏమి లాభం ; వయస్సంతా గడచిపోయిన తరువాత. ఎక్కడ పడితే అక్కడ అప్పులు తేవడం. వంటిమీదికి మంచి

గుడ్డలు లేవు సరేగదా, ఉన్నవి ఉతికించుకోవాలన్నా అప్పు తేవలసిందే. ఇవన్ని నాన్నకు చెప్పి, యీ దుర వస్థలోనుంచి బయటపడేస్తావేమోనని అడగడానికి వచ్చా. ఇదికూడా సాధ్యం కాకపోతే, ఇల్లు వదలి ఎక్కడకైనా వెళ్లాలసి వస్తుంది. కలో గంజో తాగి మేమిద్దరం కాలం గడుపుతాం. డబ్బు కోసం యెంత ప్రయత్నం చేస్తున్నాను! నీగతి కూడా నాగతి మోస్తరే ఉంటే ఇద్దరం కలసి ఎక్కడికైనా పోదాం. ఈ యింట్లో యీ పీనాసి తండ్రితో ఉండలేము.

సుం:- ఏమిటో, రోజుకు రోజుకు మనిషి బిగబిగుస్తున్నాడు గాని, కనికరం కనపడదు. అమ్మ లేనిలోటు అడు గడుక్కి కనబడుతున్నది.

చక్ర:- అదుగో, ఆయనమా మేలాగుంది. పద, ఆ మూలకు వెళ్లి మాట్లాడుకుందాం. ఆయనను దోవకి తీసుకురావడానికి ఇద్దరం కలిసి పనిచేద్దాం.

## మూడవ రంగము

(హనుమంతయ్య, లక్ష్మయ్య)

హనుమంతయ్య:-ఇంట్లోనుంచి తక్షణం పో. నోరెత్తవద్దు, ఫో ముందర, ఛటాచోర్.

లక్ష్మయ్యః- (తనలో) - ఈ ముసలాడికంటె పాపిష్టి ముండా కొడుకును యెక్కడ చూడలేదు. ఈయనకేదో పిశాచం పట్టినట్టుంది నిజంగా.

హాను:- ఏమిట్రా గొణుగుతున్నావు.

లక్ష్మ:- ఎందుకయ్యా అట్లా తోస్తావు నన్ను ?

హాను:- పైగా ప్రశ్నలు కూడా వేస్తున్నావు! పద వెంటనే. లేక పోతే యేంచేస్తానో చూడు.

లక్ష్మ:- నే నేంచేశానండి.

హాను:- చెయ్యాలిసిందంతా చేశావు. పో ! బయటికి.

లక్ష్మ:- మీ అబ్బాయిగారి నౌకరునండి. వచ్చేదాక యిక్కడ ఉండమన్నారండి.

హాను:- అట్లాగైతే పోయి వీధిలో ఉండు. ఇంట్లో మాత్రం ఉండవద్దు. పందిరి గుంజలాగ నిలబడి జరిగే సంగతులన్ని కనిపెట్టి చూస్తు నన్ను అల్లరి చేద్దామనా? నా యింట్లో, నా మీద ఒకడు కాపలా ? లేకపోతే అటుచూసి యిటుచూసి ఎక్కడేముందో గుర్తుపెట్టుకొని కాజేయ డానికా ? ఫో! వెంటనే.

లక్ష్మ:- మీ దగ్గరనుంచి కాజేసినట్టే ! బాబూ ! పెట్టెలో పెట్టి తాళం బిగించి, పడ్డదా లేదా అని లాగి లాగి, ఎప్పుడు

అక్కడే కాపలా ఉంటూ ఉంటే, ఇంక కాజేయడానికి వీల్లేకేం?

హాను:- నా యిష్టం వచ్చినట్టు తాళం పెట్టుకుంటాను. కాపలా ఉంటాను. నీ వెవడవురా అడగడానికి? చాలా బాగుంది యిది. నాకొకడు కాపలా - (తనలో)- నా డబ్బు వాసన పట్టలేదు గదా, యీ కొరివి ?-(ప్రకాశముగా)- నీలాంటివాళ్లే నేనేదో డబ్బు పాతిపెట్టానని ఊరంతా చాటించి వచ్చేది.

లక్ష్మ:- డబ్బు పాతిపెట్టారా ?

హాను:- నే నన్నానట్రా ఆమాట. (తనలో) నాకు వళ్లు మండి పోతున్నది. (ప్రకాశముగా) డబ్బు దాచానని పోయి ఊరంతా చాటించేరకం కాదూ నువ్వు.

లక్ష్మ:- మీరు డబ్బు దాస్తే యేం, దాచకపోతే యేం,మాదాకా యేమైనా వస్తేగా.

హాను:- (కొట్టుటకు చెయ్యి ఎత్తి) నాతో వాదిస్తున్నావు? ఇదిగో నీ దడ్డవాదానికి శాస్తి చేస్తా. పో బయటికి.

లక్ష్మ:- సరే, పోతాలెండి.

హాను:- ఆగు, ఆగు. ఏమి తీసుకెళ్లడం లేదుగదా?

లక్ష్మ:- మీ దగ్గరేం తీసుకెళ్లుతానండి.

హాను:- చూడండి నే నేం చెప్పను. ఏది, నీచేతులు చూపించు.

లక్ష్మ:- ఇదుగో.

హాను:- ఏది, నీ జేబులు చూడని.

లక్ష్మ:- చూడండి.

హాను:- అమ్మయ్యో, ఎంత పెద్ద జేబులో! ఎన్నైనా పెట్టుకు పోవచ్చు.

లక్ష్మ:- (తనలో) ఇటువంటి వాడి డబ్బు నిజంగా కాజెయ్యాలి. ఇలాంటివాళ్లనే కనక దోస్తే, ఆహా!...

హాను:- ఊఁ ?

లక్ష్మ:- ఏమిటండీ ?

హాను:- ఏదో దోచడం అంటున్నావేమిటోయ్ ?

లక్ష్మ:- ఏమి లేదండి. ఏమైనా దోచుకు పోతున్నానేమో నని అన్నీ జాగ్రత్తగా చూస్తున్నారన్నాను.

హాను:- అవును అందుకే చూచేది. (జేబులు వెతుకును)

లక్ష్మ:- (తనలో) ఈ పీనాసి పీనిగ చస్తే బాగుండును.

హాను:- ఏమంటున్నావ్ ?

లక్ష్మ:- ఏమంటున్నాను!

హాను:- పీనాసి వాండ్లనేదో అంటున్నావే ?

లక్ష్మ:- పీనాసి వాండ్లంతా ఏదైనా వచ్చి పోతే బాగుంటుందని అనుకుంటున్నానండి.

హాను:- ఎవరిని గురించి ఆమాట అనుకున్నది?

లక్ష్మ:- పీనాసి వాండ్లను, పిసినిగొట్టు వాండ్లను.

హాను:- అవునులే, ఎవరినిగురించి అంటున్నావూ అని ?

లక్ష్మ:- ఏదో అన్నాను లెండి. మీకెందుకీ గొడవ.

హాను:- నాకెక్కావలసినగొడవ గనకనే అడుగుతున్నాను.

లక్ష్మ:- మిమ్మల్ని గురించి అంటున్నాననుకున్నారా యేమిటి?

హాను:- నే ననుకునేదేదో అనుకుంటున్నాను. నీవెవ్వరిని ఉద్దేశించి అన్నావో నాకెక్కావాలి.

లక్ష్మ:- నాతో నేనే చెప్పుకుంటున్నాను......ఈ తలగుడ్డతో చెప్పుతున్నాను.

హాను:- ఆ తలగుడ్డలో ఉన్న నీ తలకాయతో నేను చెప్పుతున్నాను. (అని తలమీద కొట్టబోవును)

లక్ష్మ:- పీనాసి వాండ్లను తిట్టనియ్యరా యేమిటి ?

హాను:- తిట్టనిస్తాను గాని, అధికంగామాట్లాడి, పొగరుబోతుతనంగా జవాబులు చెప్పితే మాత్రం ఊరుకోను. నోరుముయ్.

లక్ష్మ:- నే నెవ్వరిని పేరుపెట్టి అనలేదే.

హాను:- ఇంకొక్కమాట మాట్లాడితే ఎముకలు విరగ్గొడతా.

లక్ష్మ:- గుమ్మడికాయల దొంగంటే, బుజాలు తడువుకుంటారేం.

హను- నోరుమూస్తావా !

లక్ష్మ:- మూస్తాను, తప్పనిసరైతే !

హను:- ఆ, ఆ.

లక్ష్మ:- (ఇంకొక జేబు చూపుతు) ఇదుగో చూడండి. ఇంకొక జేబు. సరేనా ?

హను:- అందులో ఉన్నదేదో తీసి ఇక్కడ పెట్టిపో.

లక్ష్మ:- ఏముందీ ?

హను:- అదే, నీవు కాజేసిందే.

లక్ష్మ:- నే నేమి కాజెయ్యలేదు.

హను:- నిజమేనా ? ఒట్టుపెట్టుకో !

లక్ష్మ:- ఒట్టేనండి.

హను:- ఇక దయచెయ్యి. దౌర్భాగ్యుడా !

లక్ష్మ:- బాగానే ఉంది.

హను:- పాపమో పుణ్యమో ! కట్టి కుడుపుతుందిలే !

(లక్ష్మయ్య నిష్క్రమిస్తాడు.)

## నాలుగవ రంగము

(హనుమంతయ్య వంటరిగా)

ఈ పనివాళ్లెందుకయ్యా యింట్లో చేతికి, కాలికి అడ్డం వస్తూ ! అందులో యీ వెధవెందుకు ? ఇంత డబ్బు కొంపలో

దాచి పెట్టడం యెంత కష్టమో తెలుసునా ? అదృష్టవంతులు, కానీ అయినా ఇంట్లో ఉంచుకోకుండా తెలివిగా వడ్డీలకు తిప్పుకుంటారు. ఇల్లు నాలుగు మూల్లా వెతికినా, దాచడానికి చోటే కనబడదే. ఇనప్పెట్టెల్లో మాత్రం ప్రాణం పోయినా పెట్టను. అవి దొంగలను కన్ను గిలిపి పిలుస్తై. దొంగ వెధవల చూపు ముందు ఇనప్పెట్టెమీదికే పోతుంది.

## ఐదవ రంగము

(వెనుకవైపు సుందరి, చక్రపాణి మాట్లాడుతుంటారు.)

హాను:- (ఒంటరిగా ఉన్నాడనుకొని) ఏమైనా, నిన్న వాళ్లు యిచ్చిన పదివేల రూపాయిలు తోటలో పాతిపెట్టడం నాకంత బాగుండలేదు. ఇంట్లో పదివేల రూపాయలుంచడమే, అమ్మయ్యో !.........
(సుందరిని, చక్రపాణిని చూసి తనలో) చచ్చానా ! బాబో, నా కొంప తీసుకున్నానే. సంతోషంతో వెనుక ముందు చూడకుండా ఇష్టం వచ్చినట్లు మాట్లాడాను కాబోలా భగవంతుడా ! (సుందరి చక్రపాణులతో ప్రకాశముగా) - అక్కడ ఏమిటి చేస్తున్నారు మీరు ?

చక్ర:- ఏంలేదు నాన్నా.

హాను:- ఎంత సేపయింది మీరు వచ్చి.

సుం:- ఇప్పుడే వస్తున్నాం.

హాను:- విన్నావా ?...

చక్ర:- ఏమిటి నాన్నా ?

హాను:- అక్కడ...

సుక:- ఏమిటి ?

హాను:- నేనిప్పుడు అంటున్నదే.

చక్ర:- నేను వినలేదు.

హాను:- విన్నావు — నిజంగా విన్నావు.

సుం:- వింటే చెప్పను — వినలేదంటుంటే.

హాను:- ఏదో కొద్దిగా విన్నట్టే ఉందిలే! ఏమిలేదు. ఈ రోజుల్లో డబ్బు దొరకడమంటే యెంత కష్టంగా ఉన్నదో నని, పదివేల రూపాయిలు ఇంట్లో ఉంటే బాగుండునే అని అనుకుంటున్నాను.

చక్ర:- నీవు ఒంటరిగా ఉండి, ఏదో ఆలోచిస్తూంటే ఎందుకు రావడమని రాలేదు.

హాను:- ఏమాలోచిస్తున్నానో చెప్పానుగా. పదివేల రూపాయిలు ఉన్నాయని దురభిప్రాయ పడతారేమోనని, చెప్పుతున్నాను.

చక్ర:- నీ వ్యవహారాల జోలికి మేమెన్నటికి రాను.

హాను:- దేవుడు మేలుచేసి పదివేలరూపాయిలంటూ ఉంటే...

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణ భారత పుస్తకసంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింప చేసింది. ఆ ప్రచురణలవలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడ భాషలలోనికి అనువాదం చేయించి ప్రచురింపజేస్తూంది. పాఠకులలో భిన్నభిన్న అభిరుచులకు తగినట్టు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశారు. అందువల్ల, మానవ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గుర్తించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘనకార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథపరంపరలో ఒక శాఖ. మన దేశశ్రేయస్సు కోసం, అభ్యుదయంకోసం ఆ మహాపురుషులు ఏమి చేసినది, వారికి తామెంత ఋణపడి ఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించటానికి వారెన్నెన్నిపాట్లు పడినది ముందుతరాల వారంతా తెలుసుకుని ఉండుట మంచిది.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం— ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీన కళా సంపదను అభివర్ణించే గ్రంథాలుకూడా ఇందులో ఉండటం ముదావహం. నాటకకళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నితరాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాస దాయకములైన భిన్నభిన్న విషయాలను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆ విధంగా ఇట్టి ప్రచురణలకు ముందుముందు విస్తారప్రచారం కలుగగలదని నా విశ్వాసం.

దక్షిణ భారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింప చేయటం ఈ ద్వితీయ గ్రంథ పరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు, విద్యావంతులలో ఎక్కువమందిని వివిధ విషయాలను గురించిన జ్ఞానాసక్తి గల పాఠకులుగా ఆకర్షించి ఆ జ్ఞాన పిపాసను తృప్తిపరచటానికి యోగ్యమైన గ్రంథాలను కూడా వారికి అందజేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణ భాషా సంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

ఇట్లు,

మద్రాసు,
7-10-1958.

ఏ. లక్ష్మణస్వామి ముదలియార్,
వైస్ ఛాన్సెలర్.
మద్రాసు విశ్వవిద్యాలయం.

# ఉపోద్ఘాతము



ప్రపంచ ప్రసిద్ధులైన షేక్స్పియర్ మున్నగు ఉత్తమ నాటక కర్తలలో మోలియర్ (1622–73) ఒకరు. వ్యంగ్య ప్రహసన రచనలో ఆయనకు ఆయనే సాటి. ఆయన అసలు పేరు జీన్ బాప్టిస్టీ పాక్వెలిన్. 'మోలియర్' అన్నది నాటక కర్తగా ఆయన పెట్టుకున్న పేరు.

మోలియర్ పారిస్‌లో జెసూట్ల (క్రైస్తవ మతోపశాఖ) వద్ద విద్యాభ్యాసం చేసి, 21వ యేట ఒక నాటక సమాజంలో చేరాడు. అచిరకాలంలోనే ఆయన నటుడుగా, నాటక కర్తగా, ఆ నాటక సమాజ నిర్వాహకుడుగా రాణించాడు. ఆ సమాజానికి "ఆదర్శ నాట్యమండలి" అని ఘనంగా నామకరణం చేశాడు.

ఆదర్శ నాట్యమండలి పారిస్‌లో అంతగా రాణించలేక పోయింది. అందువల్ల చిన్న పట్టణాలలో, పల్లెలలో ప్రదర్శనాలిస్తూ సంచారం ప్రారంభించింది. ఈ విధంగా పన్నెండు సంవత్సరాల ప్రదర్శనానుభవంతో మోలియర్ రెండు విషయాలు తెలుసుకున్నాడు. విషాదాంత నాటకాలలో తాను సమర్థంగా నటించలేడు. రెండవది, ఈ క్లిష్టానుభవంతో, నాటక ప్రదర్శనంలోని లగువు బిగువులను ఆకళింపు జేసుకున్నాడు.

1658 లో పారిస్‌కి తిరిగివచ్చి, ఒక ప్రహసనం ప్రదర్శించ డంతో ఆయనకు యోగదశ అందుకుంది. 'డాక్టరు ప్రణయం' (**Doctor in Love**) అన్న ఆ ప్రహసనం ఫ్రాన్స్ చక్రవర్తి పధ్నాలుగవ లూయీని ఆకర్షించి, కడుపుబ్బ నవ్వజేసింది. ఆపైన, మోలియర్ జీవితాంతం వరకు, చక్రవర్తి ఆయనకు ముఖ్యమిత్రుడు. అవసరమైనప్పుడల్లా ఆయనకు రాజాదరం లభించేది. చివరికి చక్రవర్తి ఆయనకు పెన్షనుకూడ ఏర్పాటు చేశాడు.

సంఘంలో డాబు దర్పాలతో ఘనంగా చెలామణి అయిపోతూన్న దగుల్బాజీతనంగా తనకు కనిపించిన ఏ సంఘ టననైనా సరే మోలియర్ తన వ్యంగ్యరచనకు వస్తువుగా మలచుకొనేవాడు. ఆయన మొత్తం 25 ప్రహసనాలు రచిం చాడు. మానవుల కృత్రిమాభినయమే ఆయన రచనలన్నింటిలోను ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఆనాటి స్త్రీల కృత్రిమాభినయం ('లే పెన్యూసెస్ రిడిక్యూల్స్' లోను), నడుమంతరపు సిరిపట్టిన వారి ఆర్భాటాలు ('లే బూర్జువా జెంటిల్ హోమ్మీ' లోను), మతనిష్ఠగా చెలామణి అయే డంబాచారం ('టార్టఫీ' లోను), నాటు వైద్యుల భేషజం ('లే మాలడే ఇమాజినైట్' లోను),. సాధారణంగా ఆధునిక జీవితంలో కనిపించే ఇతర కృత్రిమ వంచనా విధానాలను ఆయన తన నాటకాలలో రసవంతంగా చిత్రించాడు.

చక్ర:- నేనే మీ......

హాను:- ఆహా! ఎంత హాయిగా ఉండును.

సుం:- ఈ సంగతులు...

హాను:- నిజానికి నాకిప్పుడెంతో అవసరం.

చక్ర:- నేను......

హాను:- ఆ డబ్బు ఉంటేనా...

సుం:- నాన్నా నువ్వేదో...

హాను:- ఇప్పుడు పడుతున్న బాధలన్నీ విరగడై పోయేవి.

చక్ర:- అదేమిటి నాన్నా, అట్లా అంటావు! నీకేంతక్కువ? మాకు తెలియదూ నీకెంత డబ్బుందో.

హాను:- అదే, ఆ కూతే వద్దనేది. డబ్బట! ఎక్కడరా ఉన్నది. అంతా అబద్ధం. ఉన్నదని ఊరిమీద సాటించే వాళ్లంతా నా గొంతు కోద్దామని చూచే వాళ్లే.

సుం:- ఎందుకు నాన్నా, అలా అరుస్తావు?

హాను:- నాకడుపున పుట్టిన వాళ్ళే నా మీదికి వచ్చి నా విరోధు లౌతుంటే చేసేదేమిటి?

చక్ర:- నీవు భాగ్యవంతుడివంటే అందులో విరోధం ఏముంది నాన్నా?

హాను:-ముమ్మాటికి. డబ్బుందని అనుకోవడం, అనుకొని యిష్టం వచ్చినట్టు ఖర్చు పెట్టటం, చివరకు నన్ను గంగలో దింపడం.

చక్ర:- నేనేం ఖర్చులు పెట్టుతున్నాను ?

హాను:-ఖర్చులా? ఈ గుడ్డలేమిటి? ఈ ఊరిమీద తిరగడమేమిటి? జమిందారు పనుకుంటున్నావా. నిన్ననే నీచెల్లెలిని కోప్పడ్డాను. నీవు దాన్ని మించిపోయావులే.అమ్మయ్యో ఇంత డబ్బుపెట్టి యీ గుడ్డలేమిటీ అని! ఆ డబ్బుమీద వచ్చే వడ్డీ మీద బతకొచ్చే? ఇదుగో, నీకిదివరకెన్ని సార్లో చెప్పాను. నీ వ్యవహారం నాకేమి బాగుండలేదు. ఈ జమిందారీ పోకళ్లు, యీ గుడ్డలు యెక్కడవిరా నీకు, నన్ను దోపిడీ చెయ్యక పోతే.

చక్ర:- నిన్ను దోపిడా ?

హాను:-అవును, నాకేంతెలుసు! ఈ వేషాలకి డబ్బెక్కడనుంచి వస్తున్నది నీకు ?

చక్ర:- ఎక్కడనుంచా, జూదంనుంచి; నాది గెలుపుచెయ్యి, ఆ డబ్బుపెట్టి గుడ్డలు కుట్టించుకున్నా.

హాను:- అదే చేయకూడని పని. గెలుస్తున్నావుగదా ఆ డబ్బు జాగ్రత్తగా వడ్డీకిస్తే ఎంత లాభం. ముందుకు పనికొస్తుందిగా. అవునుగాని, యీ బంగారపు గుండీలు, పిన్నుల్లు, యీ నెక్టైలు, బెల్టులు, యెందుకురా? నాలుగు పిన్నీసులో, ట్వైను దారమో పనికిరాదు. నడుముకు నవారు బిగిస్తే లాగూ చస్తే జారుతుందీ? నీవు కిందటి సారి యెన్నాళ్ళయింది తల కత్తిరించుకొని? ప్రతి

పదిహేను రోజులకు మంగలివాడి నెత్తిన పెట్టాలిసిందేనా! ఏం, జుట్టు చక్కగా ఒత్తుగా ఉంటే? కత్తిరింపుకు అర్ధ రూపాయి అయితే నెలకు ఒక రూపాయి, సంవత్సరానికి పన్నెండు రూపాయిలు. ఏమిటీఖర్చు!

చక్ర:- నీవనేది నిజమే నాన్నా.

హాను:- ఇది చాల్లే, వేరే విషయం మాట్లాడదాం. (చక్రపాణి, సుందరి సంజ్ఞలు చేసుకోడం చూచి) ఓహో! (తనలో) నా—దగ్గర—డబ్బు కాజెయ్యాలనే ఉద్దేశంతో యేదో సంజ్ఞలు చేసుకొంటున్నట్టున్నారు. (ప్రకాశంగా) ఏమిటా ముక్కులూ మూతులు తిప్పడం.

సుం:- అన్నయ్యా, నేను ఎవరు ముందు మాట్లాడుదామా అని తగాదా పడుతున్నాము. మాయిద్దరికి నీతో చెప్పాలసిన దున్నది.

హాను:-నాకూ చెప్పాలసిన దున్నది మీ యిద్దరికీ.

చక్ర:- పెండ్లి విషయం మాట్లాడదాం అనుకున్నాము, నాన్న!

హాను:-నాకూ పెండ్లి విషయమయ్యే మీతో మాట్లాడవలసి ఉన్నది.

సుం:- అయ్యో, అట్లాగా నాన్నా!

హాను:-అయ్యో, ఏమిటి, నీమొహం. పెండ్లంటే ఇంత భయం ఎందుకు?

చక్ర:- నీకు పెండ్లంటే ఉండే అభిప్రాయం వేరు, మా అభిప్రాయం వేరు. అందుకు భయపడుతున్నాము.

హాను:-కొంచెం ఓపిక పట్టండి. అంత భయమైతే యెల్లాగా. మీ ఉభయులకు యేది శ్రేయస్కరమో నాకు తెలుసు. నేను చేసే దానిలో మీకు ఏవిధమైన ఇబ్బంది రాదు. (చక్రపాణితో) సరేగాని, మన యింటిపక్కగా చారుమతి అనే పిల్లను చూశావా ?

చక్ర:- చూశాను నాన్నా.

హాను:-నీవో ?

సుం:- చూడలేదుగాని విన్నాను.

హాను:-నీకెట్లా ఉందిరా ?

చక్ర:- చాలా చక్కనిపిల్ల. ఆమె కేం ?

హాను:-ఆమె ఆకారం యెట్లా ఉంటుందిరా ?

చక్ర:- నెమ్మదైనదిగాను, తెలివైనదిగాను కనబడుతుంది.

హాను:-నడక, పద్ధతి ఎట్లా ఉంటాయి ?

చక్ర:- బహు అందంగా ఉంటాయి.

హాను:-అటువంటి పిల్లను గురించి ఆలోచించాలంటావా, లేదా?

చక్ర:- తప్పకుండా.

హాను:-మంచి సంబంధమేనంటావా ?

చక్ర:- నిస్సందేహంగా.

హాను:-ఆ పిల్లను చేసుకొన్నవాడు సుఖపడతాడంటావా ?

చక్ర:- ఇంకా అనుమానం యేమిటి నాన్నా.

హాను:-అయితే ఒక్కలోటున్నదిరా, డబ్బున్నట్టు కనబడదు.

చక్ర:- పోనిలే నాన్నా డబ్బు లేకపోతే, మర్యాదైన కుటుంబం అయితే చాలు.

హాను:-అట్లా అనడానికి వీలు లేదు. డబ్బు రూపేణా రాక పోయినా, యింకో విధంగా లాభించేట్టు చెయ్యవచ్చు.

చక్ర:- అవును.

హాను:-నీకు ఆపిల్ల నచ్చినందుకు చాలా సంతోషం. అందుకనే ఆ పిల్ల పద్ధతి చూచినప్పటినుంచి నాదృష్టి అటే పడ్డది. ఏ కొంచెమో కట్నం అంటూ వస్తే, నేను చేసుకోవ డానికి నిశ్చయించుకున్నాను.

చక్ర:- అదేమిటి?

హాను:-ఏముంది!

చక్ర:- చేసుకోడానికి నిశ్చయించు కున్నానన్నావా.

హాను:-అవును చేసుకొంటాను.

చక్ర:- ఎవరు, నీవేనా, నీకే.

హాను:-అవును, నేనే, నేనే. నేనే, నాకే. ఏం, చేసుకోకూడదా.

చక్ర:- నాకు కండ్లు తిరుగుతున్నట్లున్నాయి. వెళ్ళనీ.

హాను:-మరేం ఫరవాలేదు. వంటింట్లోకెళ్ళి చెంబెడు చల్లటి నీళ్ళు తాగు తగ్గిపోతుంది.

(చక్రపాణి నిష్క్రమిస్తాడు.)

# ఆరవ రంగము

## (హనుమంతయ్యా, సుందరి)

హను:-ఇదుగో, సుందరీ! నేను చేయదలచుకున్నది. చారుమతిని నేను చేసుకుంటాను. మీ అన్నయ్యాకు ఒక పెద్దపారు పిల్లను చూశాను. నిన్ను అనంతయ్యాకు యిచ్చి పెళ్ళి చేస్తా సరేనా.

సుం:- ఎవరికి అనంతయ్యాకా.

హను:-అవును. ఆయనకేం, చాలా నెమ్మదైనవాడు, మంచి చెడ్డా తెలిసినవాడు, జాగ్రత్తపరుడు. యాభైకి యివతల వాడు గాని అవతలవాడు గాదు. భాగ్యవంతుడని ఊరల్లా చెప్పుకుంటారు.

సుం:- (వినయపూర్వకంగా) నాకు పెండ్లి చేసుకోవాలని లేదు నాన్నా.

హను:-(ఆమె చూపిన వినయంతోనే) తమ చిత్తమైతే ఆ సంబంధమే మీకు చేస తీరుతాను.

సుం:- (తిరిగి అట్లే) క్షమించు. నాకు పెండ్లి వద్దు నాన్నా.

హను:-(ఆమెవలెనే) క్షమించు. నీకు చేసి తీరుతానమ్మా.

సుం:- అనంతయ్యాగారు గొప్పవారే కావచ్చునుగాని ఆయనను చేసుకోను.

హాను:-నీవు చాలా మంచిదానివే కావచ్చుగాని ఆయనను నీకు యీ రాత్రే పెండ్లి చేసి తీరుతాను.

సుం:- ఈ రాత్రే!

హాను:-ఆ, ముమ్మాటికి యీ రాత్రే.

సుం:- అది జరిగేమాట అబద్ధం.

హాను:-జరిగేమాటే నిజం.

సుం:- కాదు.

హాను:-అవును.

సుం:- నాకు వద్దంటుంటే ఎందుకు నాన్నా చంపుతావు.

హాను:-నీకు చేసి తీరుతాను అని నేను చెపుతున్నాను. సరేనా ?

సుం:- పెండ్లనేది బలవంత పెట్టవలసిన విషయం కాదు.

హాను:-నిన్ను బలవంత పెట్టే తీరుతా.

సుం:- అయితే నూతిలోనో, గోతిలోనో పడతాను.

హాను:-నిన్ను నూతిలోను పడనియ్యను, గోతిలోను పడనియ్యను. పెండ్లిచేసి తీరుతాను. ఇంత యెదురు తిరిగి మాటకు మాట మాట్లాడే కూతురెక్కడైనా ఉందీ ప్రపంచంలో.

సుం:- మరి పితండ్రయినా కూతురికి యిటువంటి సంబంధం మెడకు చుట్టేడా ?

హాను:-ఈ సంబంధానికేం, నిక్షేపంలాంటిది. మంచిది కాదనే వాడెవడైనా ఉంటాడేమో చూడు.

సుం:- మతి ఉన్నవాడెవడు మంచిదనడు.

హను:-(దూరంనుంచి వస్తున్న సుదర్శనాన్ని చూచి) ఇదుగో సుదర్శనం వస్తున్నాడు. మంచిదో కాదో వాడిని అడుగుదాం. వాడు చెప్పినట్టు ఒప్పుకొంటావా.

సుం:- సరే అడుగు.

హను:-ఇదుగో చూడు అడుగుతా.

## ఏడవ రంగము

(హనుమంతయ్య, సుందరి, సుదర్శనం)

హను:-యిదుగో యిట్రావోయ్. మా యిద్దరి మధ్య తగువు తీర్చాలి, నేను చెప్పేది బాగుందో, అది చెప్పేది బాగుందో.

సుద:- మీరు చెప్పేది ఎప్పుడూ మంచిదే.

హను:-మేమేం మాట్లాడుతున్నామో తెలుసా?

సుద:- తెలియక్కరలేదండి. మీరెన్నడు పొరపాటు చెప్పరు. మీరు చెప్పేదంతా న్యాయమే. మీరు న్యాయమూర్తులు.

హను:-చూశావ్‌మరి, దీనికి మంచి యోగ్యుడు, డబ్బుగల వాడిని చూచి యీరాత్రే లగ్గం పెట్టి పెండ్లి చేస్తానంటే చూడు ఏమంటున్నదో, చేసుకోదుట. ఏమంటావ్.

సుద:- ఏమంటానా?

హాను:-అవును, ఏమంటావ్.

సుద:- ఆ, ఆc!

హాను:-ఏమిటి చెప్పవేం.

సుద:- చెప్పడాని కేముందండి. మీరన్నట్టే, మీరేం మంచికి గాక చెడుకు చెబుతారా? కాని అమ్మాయిగారు కూడా అంత తప్పనడానికి వీలులేనట్టుగా......

హాను:-ఆ యేడుపేమిటి ? అనంతయ్యకేం ? రాజాలాంటి సంబంధం. పెద్ద యింటివాడు, మంచివాడు, నెమ్మదైనవాడు, ఒడుదొడుకులు లేనివాడు, ఇంత కలవాడు. మొదటి సంబంధపు బాదరు బందీలేవీలేవు. ఇంతకంటె మంచి సంబంధం ఎక్కడైనా ఉంటుందా, అని !

సుద:- ఉండదు. కాని, యీరాత్రే లగ్గం పెట్టానంటే యెల్లాగండి. పెండ్లి అనేది నెమ్మది మీద జరగాలా ? ఇష్టానిష్టాలు ఆలోచించుకోడానికి నాలుగురోజులైనా వ్యవధి ఉండాలా ?

హాను:-ఇది ఆలస్యం చేస్తే చెయ్యిజారిపోయే సంబంధం. ఎంత అనుకూలమైన సంబంధం ! పైగా, కట్నంలేకుండా చేసుకుంటానంటుంటే ఇంక కావలసిందేమిటీ, అని.

సుద:- కట్నం లేకుండానా ?

హాను:-మరేమనుకున్నావు.

సుద:- అట్లాగైతే నేనేం చెప్పలేను. మీరు మొదటనే ఆమాట చెప్పుంటే యిందాకా మాట్లాడేవాడినా ? తప్పకుండా తొందర పడాలసిందే.

హాను:-నా కన్నివిధాల కలిసివస్తోంది.

సుద:- అందులో అనుమానం యేముంది? మరీ, పెండ్లంటే ఒక్క నాటిదా, యావజ్జీవం ఉండేది గదా. వెనుక ముందు చూడనక్కర్లేదా అని అంటున్నారుగా అమ్మాయిగారు.

హాను:-కట్నం లేకుండా చేసుకొంటా నన్నాడంటూంటే !

సుద:- నిజమే. అంతకంటే కావలసినదేముంది. కాని, పెండ్లి చేసుకొనేది అమ్మాయిగారు గనక వారిని కూడా అడిగి సరే ననిపించుకుంటే మంచిదని అనేవారుండకపోరు. వయస్సు తేడా గనక యేమి వడుదుడుకులు వస్తాయో నంటారు.

హాను:-కట్నం కానీ కూడా అక్కర్లేదని చెప్పేశాడు.

సుద:- దానికెవ్వరు అభ్యంతరం పెట్టలేదు. అయినా, పిల్లను యీడుజోడుగా ఉండేవారి కిద్దామని, చిలక గోరెంక ల్లాగ కాపురం చేస్తూంటే చూద్దామని, కొందరు కొందరు తండ్రు లనుకుంటారు. అంతేగా మరి, హాయిగా కాపురంచేస్తు నలుగురిలో మంచివాళ్ళనిపించుకుంటే...

హాను:-కట్నం కోరని దివ్యమైన సంబంధం వదులుకుంటానా? వట్టిది.

సుద:- ఔనౌను. కట్నము మాట అడగకపోతే, ఏమి లేక పోయినా ఫరవాలేదు. కట్నమడగని అల్లుడు దొరికితే పిల్ల నివ్వకుండా యెల్లా ఉంటారు.

హాను:-(తనలో, పెరటివైపు చూస్తూ) అదేమిటి కుక్క అరుపులాగున్నదే, నా డబ్బు వాసన పట్టి ఎవడూ రాలేదుగదా. (సుదర్శనంతో) నీవు కదలకు ఇప్పుడే వస్తాను.

(నిష్క్రమిస్తాడు)

## ఎనిమిదవ రంగము

(సుందరి, సుదర్శనం)

సుం:- ఏమిటి మానాన్నతో అట్లా మాట్లాడావు. వేళాకోళమా, నిజంగానా.

సుద:- ఏంచెయ్యమన్నావు, ఎదురు చెప్పితే కోపం వస్తుందేమో నని, కోపం వస్తే మొదటికే మోసమని అన్నదానికల్లా అవునన్నాను. కొందరికి ఉన్నది ఉన్నట్టు చెబితే పనికి రాదు. అల్లాంటి వారితో వాదించి లాభంలేదు. వారిని వశం చేసుకోవాలంటే వారు చెప్పిందల్లా మంచిదంటూ వుండడమే మందు.

సుం:- బాగానే ఉంది గాని, ఈ పెళ్ళి.

సుద:- తప్పించుకోడాని కేదో ఉపాయం చూదాం.

సుం:- ఇంకా చూద్దాం, ఎప్పుడు, రాత్రికి లగ్గమంటుంటే.

సుద:- వంట్లో బాగాలేదని కాలహరణం చేయాలి. ఏదో జబ్బు వున్నట్టు నటించాలి.

సుం:- డాక్టరును తీసుకొస్తాడు, ఏమిలేదని చెపుతాడు.

సుద:- అదేం లాభంలేదు. డాక్టరుకూడా గాభరాపడి పోయే టట్లు నటించాలి.

## తొ మ్మి ద వ రం గ ము

(హనుమంతయ్య, సుదర్శనం, సుందరి)

(హనుమంతయ్య ప్రవేశము)

హను:-(తనలో, వెనుకనుంచి) అమ్మయ్యా, ఏమీలేదు.

సుద:- (హనుమంతయ్యను చూడకుండా) చివరకు మిగిలినదల్లా మనం లేచిపోవడమే. నేనంటే నిజంగా ఇష్టముంటే... (హనుమంతయ్యను చూచి) కూతురన్నది తండ్రిమాట వినాలి. మొగుడి ఆకారంతోను, వయస్సుతోను యేం పని ! కట్నం అక్కరలేదంటే వెంటనే చేసుకోవలసిందే.

హను:-చక్కగా చెప్పావు. అట్లా బుద్ధిచెప్పు.

సుద:- నేనుకూడా పట్టలేక కొంచెం కఠినంగా చెప్పా. మీరేం అనుకోరుగదా.

హాను:-నేనేమి అనుకోను సరేగదా యిక్కడ్నుంచి నీవే దాన్ని జాగ్రత్తగా పట్టుకురావాలి. నీవేంచేసినా ఒప్పుకుంటాను.

సుద:- (సుందరితో) ఇక నా కెదురుచెప్పి చూడు.

(సుందరి నిష్క్రమించును)

## పదవ రంగము

(సుదర్శనం, హనుమంతయ్య)

సుద:- అమ్మాయిగారితో వెళ్లమని శెలవా ?

హాను:-తప్పకుండా పోయి ఆ మూడుముళ్లు పడేటట్టు చూడు.

సుద:- అయితే అమ్మాయిగారిని వెయ్యి కండ్లతో కనిపెట్టి ఉండాలి.

హాను:-అవును.

సుద:- మరేం భయపడకండి. అన్నీ చక్కపెడతాను.

హాను:-చెయ్యి, చెయ్యి, అట్లాగే చెయ్యి. నేను కొంచెం ఊళ్లోకి వెళ్లి యిప్పుడే వస్తాను.

సుద:- (సుందరి వెళ్లిన వైపు చూస్తూ) డబ్బుని మించిన దుందిటమ్మా, పిచ్చిదానా. ఇటువంటి తండ్రి యెక్కడైనా దొరుకుతాడా ? లోకంలో ఆయనకు తెలియని విషయం అంటూ ఉన్నదా ? కట్నం వదనేవాడు

దొరికితే, కులం ఎందుకు, గోత్రం యెందుకు, చదువెందుకు, వయస్సెందుకు, అందమెందుకు, చందమెందుకు, మంచెందుకు, చెడ్డెందుకు.

హను:-ఆహాహా, ఎంత తెలివైనవాడివోయ్! ఎంత మంచి వాడవోయ్! ఎవరన్నా అట్లామాట్లాడ గలరా. నా అదృష్టం వల్ల దొరికావోయ్.

---

# రెండవ అంకము

## ఒకటవ రంగము

(చక్రపాణి, లక్ష్మయ్య)

చక్ర:- ఎక్కడికెళ్లావోయ్, ఇక్కడే ఉండమని చెప్పానా...

లక్ష్మ:- అవును బాబూ చెప్పారు. కాని మీ నాన్నగారు మా చెడ్డవారండి ఏంకోపం, ఏంకోపం. బయటకెళ్లక పోతే యెముకలిరగ్గొడతా నన్నారు.

చక్ర:- సరే. మన వ్యవహారం యెట్లా నడుస్తున్నది? అడుగడుక్కి వత్తిడెక్కువౌతున్నది. ఉన్నదిచాలక మానాన్న నాకు పోటీ, ఇద్దరం ఒక పిల్లనే చేసుకోవాలని.

లక్ష్మ:- ఏమిటి, ఆయనే పెండ్లి చేసుకుందామనుకుంటున్నారా?

చక్ర:- అవును. నా గుట్టు బయటపడకుండా తప్పుకొచ్చే టప్పటికి తలప్రాణం తోక్కొవచ్చింది.

లక్ష్మ:- ఆయనకు పెండ్లెందుకండి ? ఆయనకేం పిచ్చెక్కిందా లేక పిశాచం పట్టిందా ?

చక్ర:- ఇంతకు, నా ప్రారబ్ధం, లేకపోతే ఆయనకు పెండ్లి చేసు కోవాలని బుద్ధి పుట్టడ మేమిటి?

లక్ష్మి:- అయితే ఉన్న సంగతి చెప్పక యెందుకీ దాపరికం.

చక్ర:- ఎందుకా, వ్యవహారం మొదటికే మోసం వస్తుందని. అది కాకపోయినా పెండ్లినుంచి దృష్టి మళ్ళించే వుపాయం ఆలోచించాలిగా. సరే, ఏమన్నారు వాళ్ళు.

లక్ష్మి:- ఏమన్నారేమిటి బాబు. అప్పుకెళ్ళితే అన్నీ కష్టాలే బాబు. ఈ అప్పులిచ్చేవారితో మీరేం వేగుతారో.

చక్ర:- పని కాలేదన్నమాటేనా యేమిటి.

లక్ష్మి:- అదేం లేదండి బాబు. మనవాడేనండి బ్రోకరు; ఎన్నో అగచాట్లు పడి కుదిర్చానన్నాడండి. మీరుగనక చెయ్యాలిసొచ్చిం దన్నాడు.

చక్ర:- అయితే నాక్కావలసిన పదిహేనువందల రూపాయిలు యిప్పిస్తాడన్నమాటేనా?

లక్ష్మి:- ఇప్పిస్తాడండి. ఏవో కొద్ది షరతులున్నయిటండి.

చక్ర:- డబ్బిస్తానన్నాయనతో నీవు మాట్లాడావా?

లక్ష్మి:- ఆలాగైతే లేందేమిటి బాబు. మీకెంత దాపరికమో ఇచ్చే ఆయనకీ అంతే దాపరికమట. మీకేం తెలుసునండి బాబు. పోయినకొద్ది లోతుంది. సుబ్బయ్య ఆయన పేరు చెప్పడు. ఇవ్వాళ మిమ్మల్నిద్దరిని ఒక చోటికి చేర్చుతాడట. మీకున్న ఆస్తిపాస్తులను గూర్చి ముఖాముఖిన మాట్లాడితే యిట్టే కుదురుతుందట. ముసలాయన మీ

నాన్నగారని తెలిస్తే పేచీయే లేదు. డబ్బు వళో పడు తుంది.

చక్ర:- మా నాన్నకే కాదు, మా అమ్మకు కూడా కావలసినంత ఆస్తి ఉంది.

లక్ష్మ:- ఇదుగోనండి, ఏవో కొన్ని షరతులు రాసి పంపించారట మన సుబ్బయ్యగారిచేత. మీకు వినిపించమన్నారట. "రెండవవారు సరియైన దస్తావేజు వ్రాసి వారి ఖర్చులతో రిజిస్ట్రారువారి యెదుట రిజిష్టరీ చేసేముందు రెండవ వారి తాలూకు స్థిరాస్తులమీద యెట్టి జప్తులు గాని, హామీలుగాని, తనఖాలుగాని లేవని ఒకటవవారు తృప్తిపడవలసియున్నది. మరిన్ని రెండవవారు, అనగా అప్పు తీసుకొనేవారు పద్దెనిమిదేండ్లు మించినవారుగా వుండవలెను."

చక్ర:- వాటికేం బాగానే ఉన్నాయ్

లక్ష్మ:- "రెండవవారు తనఖా మొత్తంమీద నెల ఒకటికి నూటికి అర్ధరూపాయి చొప్పున వడ్డీ యిచ్చే ఏర్పాటు."

చక్ర:- వడ్డీ చాలా సరసంగా ఉంది. ఎనిమిది అణాలు.

లక్ష్మ:- "అయితే ఒకటవవారి దగ్గర యిప్పుడు పైకం హోజరులో లేనందుననున్నూ, రెండవవారు చాలా మంచివారనున్నూ సహాయం చేయదగినవారున్నూ గనుక రెండవవారికి యిచ్చే నిమిత్తం ఒకటవవారు లోకులవల్ల తేబొయ్యే

తనఖా మొత్తంకు ఒకటవవారు సదరు లోకులకు యివ్వవలసివచ్చే వడ్డీ అనగా నూటికి నెలకు రూపాయి న్నర, ఒకటవవారికిగాను రెండవవారే యిచ్చేలాగున నున్నా.'

చక్ర:- వీడమ్మ కడుపు కాలా. మార్వాడీ రేటును మించి పోయిందే. రెండురూపాయల వడ్డీయా.

లక్ష్మి:- అవునండి. యెక్కువే. యేంచెయ్యడమో మీరే ఆలో చించాలి.

చక్ర:- ఆలోచించే దేమిటి. ఎంతవడ్డీ అయినా డబ్బు కావలసిందే.

లక్ష్మి:- నేనూ అదే చెప్పాలెండి.

చక్ర:- ఇంకా యేమైనా ఉన్నయ్యా షరతులు ?

లక్ష్మి:- అసలు వైపోయినయి లెండి, యేవో కొద్దివున్నయి. "రెండవ వారికి కావలసిన పదిహేను వందల రూపాయి లకు, ఒకటవవారు రొఖ్ఖపూర్వకంగా యిచ్చే వెయ్యి రూపాయిలు గాక, శేషించిన ఐదువందల రూపాయిలు ఒకటవవారు నిర్ణయించే ధరల ప్రకారం చర రూప మైన వస్తువులను రెండవవారు తీసుకొని, జుమలా పదిహేనువందల రూపాయిలకు పత్రం వ్రాసి యిచ్చే లాగుననున్నా."

చక్ర:- ఇదేమిటి నాకర్థం కావటం లేదే ?

లక్ష్మ:- దీనికొక చరాస్తి పెడ్యూలు ఉంది వినండి.
అయిటం ఒకటి - నాలుగు కాళ్ల పందిరి పట్టిమంచం ఒకటి, దానికి సంబంధించిన పీచు పరుపు, పైన దూది పరుపు, రెండు అద్దకం దుప్పట్లు, కుచ్చుల దిండ్లు - ఒకటి పక్కలోకి, ఒకటి తలకిందికి. వెరశి శాల్తీలు ఏడు. పాద రసం బుడ్లతో సహా చాందినీ.

చక్ర:- నాకెందుకోయి యీ మంచం నెత్తిన కొట్టుకోటానికా?

లక్ష్మ:- రెండవ అయిటం - "రంభా రావణ సంవాదం" మొఖమల్ గుడ్డమీద ఊలుతో కుట్టుపని. మూడవ అయిటం- జాజి చెక్కల డ్రాయరు. కాళ్లు లేనందున దీనికి సంబంధించిన నాలుగు చెక్కుడు రాళ్లు.

చక్ర:- నానెత్తిమీదకి యివన్నీ ఎందుకోయ్.

లక్ష్మ:- నాల్గవ అయిటం - అన్నిగాని కొన్నిగాని తీగలున్న ఫిడేలు. ఐదవ అయిటం - లోపల పైన అద్దం బిగించిన బొట్టు పెట్టె, దాని సొరుగులలో ఉండే కుంకుమ భరిణ, కాటిక్కాయ, పచ్చీసులు వగైరాలు. ఆరవ అయిటం- గడ్డి పెట్టి కుట్టిన ముంగిస చర్మం. ఇది రెండవ అయిటము ప్రక్కన పెడితే అందంగా వుంటుంది. ఇవన్నీ బజారు ధర ఆరేడు వందల రూపాయలకు మించి ఉన్నప్పటికి, రెండవవారియందు ఒకటవవారికిగల ఆదరాభిమానములవల్ల నిర్ణయించిన ధర ఐదువందల రూపాయిలు మాత్రం.

చక్ర:- ఆదరాభిమానాలట, చండాలుడు. ఇంత ఘోరం చూచారా యెవరైనా? రెండు రూపాయల వడ్డీ చాలక, యిచ్చే అసల్లోనే విరగ్గొయ్యడమా? ఈ పాడు సామానులు నేనేం చెయ్యను. అమ్మితే అరవై రూపాయిలైనా రావు. కాని నేనేం చెయ్యను. ఏమైనా తీసుకోవలసిందే. గొంతుమీద కత్తి పెట్టాడు.

లక్ష్మి:- మీకు కోపం రాకపోతే ఒకమాట చెబుతా. యీ వడ్డీ ఏమిటి, ఈ అప్పు తేవడం ఏమిటి? కొంప గుండమే కాని యేమైనా ఉన్నదా?

చక్ర:- నేనేం చేసేదోయ్. నాకుమటుకు నాశనమవ్వాలని ఉన్నదా. మా నాన్నలాంటి తండ్రులుంటే కొడుకుల గతి యిదిగాక యింకా యేమైనా ఉంటుందా? అటువంటి తండ్రులు చావాలని కోరుకొనే కొడుకులున్నారంటే, యెవరిది తప్పు.

లక్ష్మి:- అవును బాబు, మీ నాన్నలాంటివారు ప్రపంచంలో లేరు. ఎంతవాడికైనా కడుపు మండుతుంది ఆయన్ని చూస్తే. బాబూ మీకొక రహస్యం చెప్పనా. నేనూ చాలా చూశాను. నా స్నేహితులు కొందరు జైలుకు కూడా వెళ్లారు. నాకు పోలీసులన్నా జైలన్నా అంత యిష్టం లేదు గాని ముసలాయన్ని చూచినప్పట్నించి, దొంగతనం చెయ్యాలని చేతులు గులగుల్లాడుతున్నాయి

బాబు. ఆయన డబ్బు కాజేస్తే దొంగతనం అనిపించుకోదు బాబు.

చక్ర:- జాగ్రత్త. ఆపని మటుకు చేయకు. నిన్ను నన్ను యిద్దర్ని జైలుకు పంపిస్తాడు. ఏది ఆ కాయితం యిలా యియ్యి. మళ్ళీ ఒకసారి చూడనీ.

## రెండవ రంగము

(హనుమంతయ్య, సుబ్బయ్య)

(చక్రపాణి, లక్ష్మయ్య వెనుకకు పోవుదురు)

సుబ్బ:- చిత్తం బాబు. కుర్రాయన కెవరికో డబ్బు కావాలిటండి. మహా యిబ్బంది పడుతున్నాడు. మీరేం చెయ్యమంటే అది చేస్తాడు.

హను:- బాగానే ఉందిలే సుబ్బయ్యా! చూడు మన సొమ్ముకేం మోసం లేదు గదా? ఆస్తి పాస్తి బాగా ఉన్నదా, మంచి కుటుంబమేనా ?

సుబ్బ:- నాకవ్వన్నీ అంతబాగా తెలియవండి. మీ సెలవైతే ఆయన తమ దగ్గర కొచ్చి అన్ని సంగతులు తమకు తృప్తి గలిగేట్టు చెప్పుతాడని ఆయన మనిషి చెప్పాడండి. నాకు తెలిసిందల్లా ఆయన భాగ్యవంతుల కుటుంబంలో పుట్టాడని, తల్లి లేదనీ, అంతగా చెప్పవలసిన అవసరం వస్తే

తండ్రి యేడెనిమిది నెలలకన్న బతకడని కూడా గట్టిగా చెప్పగలడట.

హాను:- పోన్లేవోయీ, అదీ బాగానే ఉంది. మనకు భగవంతుడు ఏదో కొంచెం యిచ్చాడు గదా, ముష్టిలోనే ముష్టి. దానం ధర్మం కూడా అవసరమేగా.

సుబ్బ:- తమరంతగా సెలవియ్యాలా ?

లక్ష్మ:- (సుబ్బయ్యను చూచి చక్రపాణితో మెల్లగా) ఇదేమిటి బాబో, సుబ్బయ్యగారు మీనాన్నతో మాట్లాడు తున్నారు.

చక్ర:- (లక్ష్మయ్యతో మెల్లగా) ఆ బ్రోకరుతో నేనెవ్వరో చెప్పలేదుగదా, నాకొంపతీసి నీవేమైనా చెప్పావా ?

సుబ్బ:- (చక్రపాణి లక్ష్మయ్యలతో) చాలా తొందరగా ఉన్నట్టుందే తమకు - ఈ యిల్లని యెవరు చెప్పారు ? (హానుమంతయ్యతో) నేనుమటుకు తమ పేరుగాని అడ్రసుగాని యివ్వలేదండి. అయినా ఫరవాలేదు లెండి. వారు చాలా యోగ్యులు, ఇక్కడే మాట్లాడి వ్యవ హారం పరిష్కారం చెయ్యండి.

హాను:-ఎల్లాగు ?

సుబ్బ:- (చక్రపాణిని చూపి) ఈయనేనండి పదిహేనువందలు కావలసిన వారు.

హాను:-నీవేనట్రా దౌర్భాగ్యుడా డబ్బు ధ్వంసం చేయడానికి చూస్తున్నది.

చ:- నీవేనా నాన్న యీ పాపిష్టి పనులు చేసేది.

(హనుమంతయ్య పారిపోవును. లక్ష్మయ్య చాటుగా దాక్కొనును.)

## మూడవ రంగము

### (హనుమంతయ్య, చక్రపాణి)

హాను:-ఇల్లాగేనట్రా అప్పులుచేసి నాశనమయ్యేది.

చక్ర:- ఇల్లాంటి అప్పులిచ్చేగా నీవు సంపాదించేది.

హాను:-దీనితరువాత నాయెదుట నిలుచుని మాట్లాడ్డానికి నీకు మొహం యెట్లా చెల్లుతూందిరా.

చక్ర:- దీని తరువాత ఊళ్ళో మొహమెత్తుకుని నీవెల్లా తిరుగుతావు నాన్నా!

హాను:-పెద్దలు చెమటోడ్చి గడించిన సొమ్మును యిట్లాగేనా దుబారా చెయ్యడం.

చక్ర:- నీవు చేసే వ్యాపారం మాటచెప్పు! పరువా? ప్రతిష్ఠా? మర్యాదా, గౌరవమా? యీ వడ్డీలేమిటి, యీ కర్కోటకపు షరతు లేమిటి? యీ మోసం చెయ్యడమేమిటి?

హాను:-ఫో దుర్మార్గుడా నా యెదుటనుంచి ఫో!

చక్ర:- ఎవడు నాన్నా దుర్మార్గుడు? అక్కరకు అప్పు తెచ్చే వాడా? అక్కర లేకుండా రూపాయికి రూపాయి పుట్టించేవాడా?

హను:-పో పో నాచెప్పులు పగిలిపోతున్నాయి. (చక్రపాణి నిష్క్రమించును.) (ఒంటరిగా) పోస్లే యిదీ ఒకందుకు మంచిదే. వీడిపద్ధతి, వీడి వ్యవహారం యేమిటో మరింత జాగ్రత్తగా చూడాలన్నమాట.

## నాల్గవ రంగము

(హనుమంతయ్య, కళావతి)

(కళావతి వస్తూ)

కళావతి:-అయ్యా, ఉన్నారా బాబూ ?

హను:-ఒక్క నిమిషమాగు. ఇప్పుడేవస్తా (తనలో) ఒక్కసారి డబ్బు చూశొద్దాం (నిష్క్రమణ)

## ఐదవ రంగము

(కళావతి, లక్ష్మయ్య)

(లక్ష్మయ్య బయటికి వస్తాడు.)

లక్ష్మ:- (కళావతిని చూడకుండా) ఇదేదో మరీ చిత్రంగా ఉందే. జాపితాలో సామాను ఒక్కటీ కనబడదే. ఎక్కడో అన్నీ దాచి వుండాలి.

కళావతి:-నీవా లక్ష్మయ్యా! యిక్కడున్నావేం?

లక్ష్మ:- నీవా కళావతి! ఏం పనిమీద వచ్చేవు.

కళా:- అందరిండ్లకు యెందుకు పోతుంటానో ఇక్కడికీ అందుకే వచ్చాను. ఏవో చిన్న చిన్నపన్లు - అది చేరెయ్యి, ఇది చేరెయ్యి - నాచేతనైనవి చేసి పెట్టుతుంటా. మన కేమైనా మడులా, మాన్యాలున్నాయా దేవుడు తెలివి పెట్టుకు బతకమన్నాడు.

లక్ష్మ:- ఈ యింటి యజమానితో కూడా నీకు పరిచయం ఉందా.

కళా:- ఏదో నాచేతనైన సహాయం చేస్తున్నా. మంచి బహు మానం వస్తుందని ఆశపడుతున్నా.

లక్ష్మ:- ఆ ముసలాడి దగ్గరనుంచేనా ? బహుమాన మియ్యకేం ? కానీ లాగావంటే చాలా తెలివైనదానివన్నమాట. ఇంకో మాట. యిల్లు నాలుగుమూలలా గాలించినా కానీ కనబడదు.

కళా:- కొన్ని పన్లు చేసి పెట్టితే డబ్బు దానంతటదే వస్తుంది.

లక్ష్మ:- నీకీ ముసలాడి సంగతి తెలియదుగాని నామాట విను. వీడు మనిషనుకుంటున్నావేమో, కాదు. వీడిని మించిన పీనాసి ఉండడు. దయా దాక్షిణ్యాలు సున్న. వీడికి ప్రాణమిచ్చినా పైసా రాలదు. అయితే, అందరినీ అండీ

అంటాడు. తియ్యాగా మాట్లాడతాడు. ప్రాసుకు తిరుగుతాడు. కౌగలించుకుంటాడు. ఎన్నైనా చేస్తాడు. దమ్మిడీ! ఉహూ, శుష్కప్రియాలు, శూన్యహస్తాలు. అప్పివ్వడమంటే తెలుసునుగాని యివ్వడమంటే యెరుగనే యెరుగడు.

కళా:- అమ్మో, అట్లాగా, అయినా ఫరవాలేదు. నేనేం చేతకాని దాన్నా. నా మాయల్లో పడనివాడు లేడు. మనస్సు లోపలదూరి చక్కలిగింత పెట్టి మరీ కాజేస్తా డబ్బు. మొగవాండ్ల నెట్లా పట్టుకు రావాలో నాకు తెలుసు.

లక్ష్మి:- ఆ పప్పులేమీ యిక్కడ ఉడకవు. అయినా చూస్తాగా ఏం చేస్తావో! కళావతీ విను. డబ్బుకి, వాడి ప్రాణానికి లంకె. ఇహమైనా పరమైనా డబ్బు. తను యివ్వవలసిన డబ్బయినా సరే అడగడానికి ఎవడైనా వస్తే అడిగే దాకా అక్కర్లేదు, చూడగానే తందనాలాడతాడు. పచ్చి పుండుమీద చెయ్యి వేసినట్టే. గుండెల్లో పొడిచినట్టే. పేగులు తరుక్కుపోయినట్టే. ఆగు, మళ్ళీ వస్తున్నాడే. నే పోతాను. (నిష్క్రమించును.)

## ఆరవ రంగము

(హనుమంతయ్య, కళావతి)

(హనుమంతయ్య వస్తూ)

హను:-(తనలో) అన్నీ బాగానే ఉన్నాయ్. (ప్రకాశంగా) ఏమేవ్ కళావతీ యిట్లా వచ్చావు.

కళా:- ఏమండోయ్, రోజుకు రోజు పడుచుతనం వస్తున్నట్టుందే.

హాను:-నన్నేనా?

క :- మిమ్మల్ని గాకపోతే యెవరిని? వంటికి రంగుకూడా వస్తున్న దే.

హాను:-రంగు గూడానా ?

కళా:- ఇంత మిస మిసలాడుతూ ఎన్నడూ, ఎన్నడూ లేరే. ఈ రోజుల్లో పాతికేళ్లకే పడుచుదనం పోవడం.

హాను:-నేనేం పాపాయినా యేమిటి. అరవై దాటితే.

కళా:- ఏం దాటితే యేం ? మీరేం చెక్కు చెదరలేదు. అరవై అంటే నడివయస్సన్నమాట. మొగవాడికి యవ్వనం అప్పుడే.

హాను:-నిజమే - కాని - ఒక యిరవై యేండ్లు తక్కువైతే...

కళా:- ఏం వేళాకోళం ఆడతారండీ, ఇరవై యేండ్లు తగ్గాలిట. నూరేండ్ల వరకు ఉండే శరీరాలు గాని మీవి, సామాన్యపువా ?

హాను:-అంతేనంటావు ?

కళా:- మీతోడు, పోనీ మీకు నమ్మకం లేక పోతే, యిటు చూడండి - (కొంచెం తలయెత్తి) అదుగో కనుబొమ్మల మధ్య - గీత - అదున్నవాళ్లు తక్కువ బతుకుతారా ?

హాను:-నీకీ గీతలు చూడటంకూడా తెలుసునా ఏమిటి ?

కళా:- గీతలే కాదు చేతులు కూడా చూస్తాను. మీ చెయ్యేది. అమ్మయ్యో, ఏమిగీత ఏమిగీత ! జెర్రిపోతులాగ ఉంది.

హాను:-అంటే.

కళా:- కనబడుతున్నదా ? ఎంత దూరం పోతున్నదో.

హాను:-పోతే యేమన్నమాట.

కళా:- నేను నూరేనన్నాను. నూటయిరవై అన్నమాట.

హాను:-అంతాయుర్దాయమే ?

కళా:- మిమ్మల్ని చంపాలి గాని, చావరు. మీ కొడుకులే గాదు, మనుమలు, మునిమనుమలు కూడా మీ కళ్ల ముందు దాటవలసిందే.

హాను:-మరీ మంచిది. సరేగాని, నా వ్యవహారం యేంచేశావు ?

కళా:- అడగాలటండి, నేను చేపట్టిన పని సానుకూలం కాకుండా బెడిసి పోవటమే ? అన్నిటికన్నా పెండ్లిండ్లు కుదర్చడంలో నా నేర్పు చెప్పారూ ! ఎటువంటి వాళ్లకైనా ఇట్టే ముడి పెట్టెయ్యటమే. అందులో మీ విషయంలో పిల్ల తల్లితో గట్టిగా మాట్లాడాను. వసారాలో తిరుగుతుంటే మీరు చూశారని, పెండ్లి చేసుకోదలుచు కొన్నారని చెప్పాను.

హాను:-ఏమన్నది ?

కళా:- ఏమనడమేమిటి తెగ సంబర పడుతూంటే. ఈ సాయంత్రం ఇక్కడికి ఒక్కసారి ఆ అమ్మాయిని పంపితే అన్ని విషయాలు మాట్లాడవచ్చు, మీ అమ్మాయిగారు కూడా ఉంటుంది అని చెప్పేసరికి, వెంటనే వొప్పుకొని, పిల్లను నన్నే వెంటపెట్టుకొని పొమ్మన్నది.

హాను:-నేనే వచ్చేవాడినిగా వాళ్లయింటికి. అయితే రాత్రికి అనంతయ్యగారిని భోజనానికి పిలిచాను, ఆ అమ్మాయి కూడా రాత్రికిక్కడే భోజనం చేసి మరీ వెళ్లచ్చు.

కళా:- సరే. సాయంత్రం నాలుగు గంటలకు వస్తుంది. ఒక గంట సేపు బజారుకెళ్లి రావలసిన పనున్నదిట. వెళ్లి తిరిగివచ్చి భోజనం చేసి యింటికి వెళ్లుతుంది సరేనా.

హాను:-మా సుందరీ, ఆ పిల్ల కలసి మాగుర్రబ్బండిమీద బజారుకు వెళ్లొస్తారు.

కళా:-అంతకన్నానా.

హాను:-అయితే కళావతి! కూతురుకు కట్నం యివ్వాలన్నమాట యేమైనా కదిలించావా. కట్నం లేకుండా పెళ్ళా? ఏదో చూడమని చెప్పు. కొంచెం కష్టపడకపోతే యెట్లా పిల్లలకు పెండ్లిండ్లు అవుతాయి?

కళా:- కొంచెమేమిటండి. ఆ పిల్లను చేసుకుంటే వేలకు వేలు లాభం మీకు.

హాను:- వేలా యెట్లా?

కళా:- ఎట్లాగా చెప్పనా? ఆ పిల్లను తల్లి తండ్రులెంతో పొదుపుగాను, జాగ్రత్తగాను పెంచుకొచ్చారు. అందరి మోస్తరు నాలుగు కూరలు నాలుగు పచ్చళ్లు అక్కర్లా భోజనానికి. యేదుంటే అదే చాలును. కాఫీలు, గీఫీలు అలవాట్లు లేవు. ఈ ఖర్చులన్నీ లేవన్న మాటేనా. ఇంకో చిత్ర మేమిటంటే, నగలన్నా, నాణ్యాలన్నా ఆ పిల్లకు తలకాయనెప్పి. పట్టుచీరలుగాని కట్ట ననదు. ఎప్పుడు వాళ్ళ అమ్మ చీరలే కట్టుకొని కాల క్షేపం చేస్తుంది. ఇదంతా లాభం కాదా యేమిటి. ఆటలు, పాటలు, సినీమాలు, సర్కసులూ ఆ పిల్లకు గిట్టవు. మామూలు ఆడపిల్లలలాగ కొట్లమీదికి ఎగబడి అయినవి కానివి కొనదు. ఇంకో పిల్లయితే వీటికన్నిటికీ ఎంతఖర్చయేదో లెక్కేసుకోండి. ఇవన్నీ వేలుగాక ఊరికే వస్తాయా.

హాను:-అయితే కుదురైన పిల్లే, సందేహం లేదు. కాని ఖర్చు పెట్టదన్న మాత్రాన కట్నమవుతుందా?

కళా:- అదేమిటండీ అట్లా అంటారు. పొదుపు, నెమ్మది, ఉన్న దాంతో తృప్తిపొందటం, యీ గుణాలు చేదా. ఇవి లేకుండా ఆస్తి తెచ్చినా యెంత నష్టమో, ఇవి ఉంటే ఆస్తి లేకపోయినా అంత లాభం.

కళా:— నేనడిగింది కొంచెం దయచేస్తే నాకు అన్నం పెట్టిన వాంరొతారు. పది కాలాలపాటు చెప్పుకుంటాను.

హాను:— సరే పోయిరా, ఉత్తరాలు రాసుకోవాలి.

కళా:— ఈ అక్కర తీర్చారా నన్ను వొద్దున పడేసిన వాళ్ల వుతారు.

హాను:— బజారు వెళ్తారన్నావుగాదు. బండి సిద్ధంగా ఉంచమని చెప్పుతా.

కళా:— నాకెంతో యిబ్బందిలేకపోతే మిమ్మల్ని యింతగా బాధ పెట్టను.

హాను:— భోజనంకూడా ఆలస్యంలేకుండా పెందలాడే అయ్యే టట్టు చూస్తాలే.

కళా:— ఈ ఉపకారం చేసి పెడుదురు పుణ్యాం ఉంటుంది.

హాను:— వెళ్లొస్తా. ఎవరో పిలుస్తున్నట్లుంది. (నిష్క్రమించును)

కళా:— (ఒంటరిగా) వీడి జిమ్మడ! పిసినిగొట్టు పీనుగు! ఎంతడి గినా మాట్లాడడేం. వీడి మొహంమండ. ఇంతమాత్రాన విడిచిపెడతానా వీణ్ని. పోనీ వీడివ్వకపోతే వాళ్లదగ్గర లాగుతా.

---

# మూడవ అంకము

## మొదటి రంగము

(హనుమంతయ్య, చక్రపాణి, సుందరి, సుదర్శనం, కోటమ్మ చీపురుపట్టుకొని— జగ్గయ్య, మండయ్య, భూషయ్య)

హను:— ఇట్రండి అంతా. ఎవరెవరేమేం చెయ్యాలో చెపుతా. కోటమ్మా నీవిట్రామందు. (చేతులో చీపురుచూచి) అదీ అట్లావుండాలి, సిద్ధంగా. ఇదిగో నీవు ఇల్లు నాలుగు మూల్ల అద్దంలా వుండేటట్టు ఊడవాలి. బల్లలు, కుర్చీలు దుమ్ముపుగాని, వాటిమీదపడి రుద్దకు. అరిగిపోతై. తెలిసిందా. ఇదిగో ఏద్తైనా విరిగిపోయినా నీ జీతంలోంచి విరగ్గోస్తా.

కోటమ్మ:— (తనలో) బాగుంది బాబు.

హను:—(కోటమ్మతో) ఇక నీవు పో.

(కోటమ్మ నిష్క్రమించును)

## రెండవ రంగము

( హనుమంతయ్య, చక్రపాణి, సుందరి, సుదర్శనం,
జగ్గయ్య, మందయ్య, ఘూషయ్య )

హాను:-ఇదిగో ఘూషయ్యా,మందయ్యా! గ్లాసులుకడగడంమీవంతు. అంతేకాదు, వాటిల్లో పరమాన్నం మీరే వడ్డించాలి. ఎట్లా వడ్డిస్తారో! ఊరికే తొందరపడి తాగండి. తాగండి అని పొయ్యకూడదు. నాలుగైదు సార్లు అడగనిచ్చి తరువాత కొద్దిగా పొయ్యాలి. తెలిసిందా. కావలసి వస్తే కాసిని నీళ్లు కలపెయ్యండి, గప్ చిప్ గా. అర్థమైందా.

జగ్గయ్య:-(తనలో) అవునండి. పాలు చిక్కగా ఉంటే అజీర్ణం చేస్తుంది.

మందయ్య:-అయ్యా! యీ గుడ్డలతోనే వడ్డించ మంటారా ?

హాను:- ఈ గుడ్డలకేం, నిక్షేపంలా ఉంటే.

ఘూషయ్య:- చొక్కానిండా నూనె మరకైందండి.

మందయ్య:- నా లాగూ వెనక చిరిగిందండి.

హాను:- తెలివితక్కువ పెద్దమ్మలు, ఉపాయం యేడిస్తేగా! నీవేమో పళ్లెం ఎప్పుడూ ముందు ఇట్లా పెట్టుకో, నీవేమో గోడవైపుకు తిరిగి నుంచో.

(పళ్లెము పట్టుకోడం, గోడవైపు నిల్చుండడం చూపిస్తాడు)

(ఘూషయ్య, మందయ్య నిష్క్రమిస్తారు)

## మూడవ రంగము

(హనుమంతయ్య, చక్రపాణి, సుందరి, సుదర్శనం, జగ్గయ్య)

**హను:**-ఇదుగో సుందరీ!- వడ్డన అదీ జాగ్రత్తగా చూసుకో వాలి. అనవసరంగా ఇంత ఇంత వెయ్యడం, పారెయ్యడం జరగ్గూడదు. ఆడవాళ్లు ఇప్పటినుంచి పొదుపు నేర్చు కోవాలి. చారుమతి వస్తుంది యిప్పుడు. నీతో బజారుకి కూడా వస్తుంది. తయారుగా ఉండు త్వరగా.

(సుందరి నిష్క్రమించును)

## నాల్గవ రంగము

(హనుమంతయ్య, చక్రపాణి, సుదర్శనం, జగ్గయ్య)

**హను:**—ఇహ నీవు దయచేయ్ యిల్లా. జరిగిందేదో జరిగింది. క్షమించాను. ఆ పిల్ల వచ్చినప్పుడు మాత్రం ధుమ ధుమ లాడుతు కూచోకు.

**చక్ర:**— ధుమ ధుమలాడ్డం ఎందుకు?

**హను:**—ఎందుకా? ఎందుకో నాకు తెలుసు. తండ్రి రెండో పెళ్ళి చేసుకొంటుంటే పిల్లలేమనుకుంటారో, యెల్లాఉంటారో నాకు తెలుసు. ఇవ్వాళ జరిగినకథ మరచి పోవాలంటే, కాబోయే సవత్తల్లిని మర్యాదగా చూడు. తెలిసిందా, ఏడుపు మొహం పెట్టకు.

చక్ర:— ఉన్నదున్నట్టు చెప్పాలంటే, ఆమె నాకు సవత్తల్లి అవుతున్నదని నాకెంతో విచారంగా వున్నది. అయితే ఆమెను గౌరవంగా చూడననిగాదు. తప్పకుండా మర్యాదచేస్తాను.

హాను:— జాగ్రత్త.

చక్ర:— నీ మనసొచ్చినట్టు నడుచుకుంటాగా.

హాను:— లేకపోతే చూడు ఏంచేస్తానో.

(చక్రపాణి నిష్క్రమించును)

## ఐదవ రంగము

(హనుమంతయ్య, సుదర్శనం, జగ్గయ్య)

హాను:—ఇదుగోనోయ్, సుదర్శనం! నీవు చాలా సాయంచేయాలి. అందుకే నీతో ఆఖరున మాట్లాడుతున్నా. జగ్గయ్యా! నువ్వు కూడా యిట్రా.

జగ్గయ్య:— మీరెవరితో మాట్లాడుతున్నట్లు? గుర్రపాడితోనా, వంటవాడితోనా, రెండూ నేనేగా.

హాను:— ఇద్దరితోను.

జగ్గయ్య:- అవున్లెండి. ముందెరివతో.

హాను:- ముందు వంటవాడితో.

జగ్గ :- అయితే ఆగండి. (కోటు తలపాగా తీసి వంటవాడిగా కనబడును)

హాను:- ఇదేమిటీ నాటకం.

జగ్గ :- సెలవివ్వండి.

హాను:- రాత్రికి నలుగుర్ని భోజనానికి పిలిచాను.

జగ్గ :- (తనలో) ఏమాశ్చర్యం, ఏమాశ్చర్యం!

హాను:- నాలుగు వస్తువులేమన్నా బాగా చేస్తావా ?

జగ్గ :- ఎందుకు చెయ్యనండి, కావలసిన డబ్బిస్తే.

హాను:- అదుగో, డబ్బు! ఆమాట తప్ప ఇంకొకటి రాదే నీ నోట! డబ్బు డబ్బు డబ్బు. ఎంత సేపూ డబ్బే. ఎవడ్ని చూసినా డబ్బు. అది తప్ప ఇంకో మాటే లేదు.

సుదర్శనం:- ఏమిటోయ్ జగ్గయ్యా అట్లాగేనా అయ్యగారడుగుతూంటే సమాధానం చెప్పేది ? డబ్బుంటే చేస్తావు ? డబ్బుంటే నీవు చేసేదేవిటి ఎవడైనా చేస్తాడు. తెలివైనవాడైతే ఏమీలేకుండానే పనితనం చూపిస్తాడు.

జగ్గ :- ఏమీ లేకుండానా ?

సుద :- అవును.

జగ్గ :- (సుదర్శనంతో) తమరేదో ఆ లేకుండా చేసి చూపిద్దురు, దయచేసి. నేను తప్పుకుంటాను అని తమకే తెలుసుగా.

హను:- చాల్లే కట్టి పెట్టు. ఏం చేయిద్దామోయ్ వంట.

జగ్గ :- ఏదైనసే అడగండి. డబ్బు లేకుండా చేయిస్తారటగా.

హను:- నాలుంటుంటే నీకుగాదు. నేనడిగిందానికి చెప్పు.

జగ్గ:- ఎంతమందొస్తారండి భోజనానికి.

హను:- ఎనమండుగురో, పదిమందో- ఎనిమిదిమందికన్నా చెయ్యక్కరలేదు. ఎనిమిదిమందికి చేసేది పదిమందికి సద్దవచ్చు.

సుద:- ఇంకా ఎక్కువమంది తినొచ్చు.

జగ్గ:- సరే- అయితే నాలుగు కూరలు, నాలుగు పచ్చళ్ళు, పులుసు, చారు, పెరుగు పచ్చడి...

హను:- ఆగు, ఆగు. ఏమిటీ, ఊరందరికి సమారాధననుకున్నావా యేమిటి?

జగ్గ:- బాగాశా దుంపల వేపుడు.

హను:- (జగ్గయ్య నోరుమూస్తూ) చాల్లే. నాయిల్లంతా గుల్ల చేశేస్తావా ఏమిటి?

జగ్గ:- అప్పడాలు, ఒడియాలు.

హను:- (జగ్గయ్య నోరు మళ్ళీ చేతితోమూస్తూ) వీటికేం అంతుందా లేదా?

సుద:- (జగ్గయ్యతో) యేమోయ్! భోజనానికి వచ్చిన వాళ్లు కడుపు పగిలి చావాలని ఉందా నీకు? ఆరోగ్యంగా

ఉండాలి అనుకొనేవాడు ఒకటో, రెండో, తగు మాత్రంగా తింటాడు గాని దత్తికి తింటాడా?

హాను:— సుదర్శనం అనేది నిజం.

సుద:— అబ్బాయి జగ్గయ్యా విను, నేచెప్పేది. ఇంటివారొచ్చారు గదా అని విస్తరినిండా పెడితే, వాళ్ళేం నాలుగు కాలాలపాటు బతకాలా? అదీకాక, పొదుపు పొచ్చెం ఉండొద్దూ? వెనకటికెవరో అన్నట్లు, బతకడానికి తినాలి గాని తినడానికా బతికేది?

హాను:-ఏం భేషుగ్గా చెప్పావోయ్! యేది, నన్ను కౌగలించుకోనీ. కోటికి విలువైన మాట విన్నాను యిన్నాళ్లకు. ఏది, తినడానికి బతికుండాలిగాని, బతకడానికి......... అదిగాదు. ఏమన్నావ్ ?

సుద:- బతకడానికి తినాలి గాని, తినడానికి బతకలేము.

హాను:-(జగ్గయ్యతో) చూచావా ఆ మాట. (సుదర్శనంతో) ఎవరు నాయనా ఆ మహానుభావుడు బంగారపు మొలకల్లాంటి ఆ ముక్కలు సెలవిచ్చింది?

సుద:- పేరు జ్ఞాపకం లేదు.

హాను:-రెండు ముక్కలు చిన్న కాయితం మీద రాశిద్దు. భోజనాల సావిట్లో పెద్ద అక్షరాలతో రాయిస్తా.

సుద:- ఓ అద్భుతపని రాశిస్తా. రాత్రి వింద. నా కొదిలెయ్యండి నేను చూస్తాగా. మీ కెందుకు యీ బాధ.

హాను:- లాగే చేసిపెడదు బాబు.

జగ్గ :- నాకూ హాయే, చేసిపెట్టు.

హాను:-(సుదర్శనంతో) వంటకూడా, తినేవాళ్లు పొదుపుగా కొద్దిగా తినేట్టు చెయ్యాలి. కూరల్లో కొంచెం ఉప్పు ఎక్కువ వెయ్యడం, ఆవాలు మెంతులు కొంచెం అధికం వెయ్యడం, తీపితో మొహం మొత్తేట్టు దాన్నిండా బెల్లం వేయడం, చేస్తే ఆట్టే తినలేరు.

సుద:- మీకెందుకు నేం జేయిస్తాగా.

హాను:-(జగ్గయ్యతో) ఏమోయ్ జగ్గయ్యా! నీవు పోయి గుర్రపు బండి తుడిచి శుభ్రం చెయ్యాలి.

జగ్గ :- ఆగండాగండి! (కోటు పాగ ధరించుతూ) ఏం శెలవు?

హాను:-బండి బాగా కడిగి, శుభ్రంచేసి, గుర్రానికి జీను గీను వేసి తయారుగా ఉండాలి. అమ్మాయిగారు వాళ్లు బజారుకు వెళ్లుతారు.

జగ్గ :- గుర్రమా బాబు. బండికి కట్టేట్టే ఉంది. గడ్డైనా ఉంటేనా తినడానికి. ఎముకల పోగు బాబు. దాని కెప్పుడు ఉపోషమేగా.

హాను:—ఏం, తీపరమా? పస్తేమైనా ఉంటేగా.

జగ్గ:— పనిలేకపోతే దాణా పెట్టరా బాబు. దాణా పెట్టి పని చేయించినా నాకిష్టమేగాని, పనిలేదని పస్తుపెడితే చచ్చిపోదు బాబూ. దాన్ని చూస్తే దుఃఖ మొస్తుంది. నోర్లేని జంతువు గదా. ఇంత కనికరం లేకపోతే యెలా బాబు.

హాను:—మరేం ఫరవాలేదు. బజారుదాకా పోయి రాగలదు.

జగ్గ:— నేనుమటుకు దాన్ని బండికట్టి, బాపంకట్టుకోను. దాని కాళ్ళు అదే యీడ్చుకోలేకపోతే బండేం లాగుతుంది.

సుద:— ఇంటిపక్కవారి గుర్రపాడిస పిలిపించి బండికట్టిద్దాంలెండి. వీడితో ఇంట్లో చాలా పనుంది.

జగ్గ:— పోన్లెండి. ఆ గుర్రం నా చేతుల్లో చావకుండా ఉంటే అంతేచాలు.

సుద:— అబ్బో ఎంతదయో!

జగ్గ:— గుర్రానికి దయచూపిస్తే పరవాలేదు. ఆయనకు దయ్యమై పట్టావుగా.

హాను:—చాల్లే ఊరుకో.

జగ్గ:— మిమ్మల్ని పొగడ్డం, మీమెప్పు సంపాదించాలని నామీద పుల్లలు పెట్టడం. ఇటువంటి వాళ్ళనుచూసి ఊరుకో లేను. ఎప్పుడూ వంటయింటి చుట్టూ తారట్లాడతాడు. అది తీసిచూడా ఇది తీసిచూడా. నిన్ననేగా నెయ్యి తెప్పించింది, యింతే ఉందంటాడు. నేనేం తాగుతు

న్నానా? అయ్యో మిమ్మల్ని చూస్తే జాలేస్తుందండి. ఊళ్లో వాళ్ళు మిమ్మల్ని యెన్ని మాటలంటారో మీకు తెలియదు.

హాను:- ఊళ్లో వాళ్లేమంటారో కొంచెం చెపుతావూ నాకు.

జగ్గ:- కోపం రాదంటే చెపుతాను.

హాను:- ఏమీ రాదు చెప్పు.

జగ్గ:- ఏమో, నాకు భయంగా ఉందండి కోపం వస్తుందని.

హాను:- రాదంటుంటే. నీకేంభయంలేదు, చెప్పు. మన్ని గురించి పదిమంది యేమనుకుంటున్నారో తెలుసుకోవటం మంచిదే.

జగ్గ:- అయితే వినండి. అందరు వేళాకోళం చేసేవారే. మేమె వళ్లమన్నా కనబడితేచాలు, ఎత్తి పొడుస్తు మాట్లాడతారు. వాళ్లనే మాటలకు చెప్పుకొనే కథలకు అంతు లేదు. ఏకాదశినాడు మీరు ఉపవాసం ఉండడం కాక, యిల్లల్లా పస్తుపెడతారట. అందరి పంచాంగాలల్లో నెలకు రెండు ఏకాదశులైతే మీ పంచాంగంలో నెలకు నాలుగుంటాయని విరగబడి నవ్వుతారు. పండగలకు పనివాళ్లకు గుడ్డలు పెట్టాలిసొస్తుందని, వాళ్లతో పండగ ముందు పోట్లాడతారట. యింటికి యే చుట్టంవచ్చినా, మైల అనిచెప్పి పంపేస్తారట. ఇంటి పక్కవారి పిల్లి పాలు

తాగి పోతే ఆయన మీద దావా వేశారట. గుఱ్ఱానికి గుప్పెడు గుగ్గిళ్ళిచ్చి, చాటుగా మళ్ళీ మీరు తీస్తుంటే, గుఱ్ఱపాడు చీకట్లో మీరని తెలియక ఎముకలు విరగ కొట్టినా నోరెత్తలేదుట. ఒకటేమిటి బాబు, ఎక్కడి కెళ్ళినా మిమ్మల్ని ఆడిపోసుకునే వారే. ఆకలితో మీకళ్లు ఎప్పుడు ఎఱ్ఱగా ఉంటాయిట. ఎక్కడికైనా భోజనానికి వెళ్ళితే మూడు రోజులకు చాలినంత తింటా రట. పిల్లికి బిచ్చం పెట్టరట, ఈగకు ఎంగిలైనా వెయ్య రట. లోభి అని, పీనాశని, పిసినిగొట్టని. ఒకటేమిటి బాబూ!

హను:-(జగ్గయ్యను తన్నుతూ, కొట్టును)

జగ్గ :- క్షమించండి బాబు. నేం చెప్పాను గాదు బాబు, కోపం వస్తుందని. చెప్పేదాకా యిందాక చంపారు. చెప్పిం తరువాత యిప్పుడు కొట్టి చంపుతున్నారు.

హను:-ఎట్లామాట్లాడాలో తెలిసిందా, యిప్పటికైనా. వెధవ!.

(హనుమంతయ్య నిష్క్రమించును)

# ఆరవ రంగము

(సుదర్శనం, జగ్గయ్య)

సుద:- (తప్పుతు) నిజంచెప్పినా పాపం దెబ్బలు తప్పలేదే.

జగ్గ:— తొందరపడకు, నాకు చేతులతో అయింది. నీకు రేపు కర్రతో అవుతుంది. అప్పుడు యికిలిద్దుగాన్లే.

సుద:— ఎందుకోయ్ అంతకోపం. ఏమన్నారట?

జగ్గ:— (తనలో) పప్పు జారినట్టు జారుతున్నాడే పీకు. కొంచెం బెదరిద్దాం. బెదిరితే పీపు పగలకొడతా. (ప్రకాశముగా) ఇదిగో నాతో వేళాకోళానికి సమయంగాదు. చిరాకుగా వుంది. కోపం తెప్పించావా ఎముకలు విరగ్గొడతా.

(సుదర్శనాన్ని బెదరించుచు మాటమాటకుతోస్తూ చివరవరకు తరుమును)

సుద:- మెల్లిగా, మెల్లిగా

జగ్గ:— మెల్లిగానా? నాకేం మెల్లిగా అక్కర్లా.

సుద:- కొంచెమాగుదు. నీకు పుణ్యాముంటుంది.

జగ్గ:— ఆగను. నీవు చాలా పొగరుబోతువి.

సుద:- లేదండి.

జగ్గ:— అండిలేదు గిండిలేదు. చేతిలో కర్రవుంటే చెపుదును.

సుద:— ఎల్లా! కఱ్ఱా! (జగ్గయ్యని, సుదర్శనము జగ్గయ్య తరిమి వల్లే తరుముచు)

జగ్గ:— కఱ్ఱేమిటి? నేననలేదే.

సుద:- నీవు కాదురా నన్ను కొట్టేది, నేను నిన్ను తన్నేది తెలిసిందా.

జగ్గ:- చిత్తం.

సుద:- అంట్లు తోముకుంటూ పడుండక.

జగ్గ:- చిత్తం.

సుద:— నాసంగతి నీకు తెలీదు.

జగ్గ:— చిత్తం క్షమించండి.

సుద:- నన్ను యెముకలు విరగ్గొడతావు!

జగ్గ:— నవ్వులాటకన్నానండి.

సుద:- నాతో నీకు నవ్వులాటా? వెధవా! (కఱ్ఱతో కొట్టును) ఇప్పుడు తెలిసిందా వెధవా.

జగ్గ:— (ఒంటరిగా) నిజం యెన్నడూ చెప్పకూడదు. అంతకంటె పాడుపని లేదు. ఇకచస్తే నిజంచెప్పను. ఆయన కొట్టా డంటే, పోని యజమాని గనక కొట్టాడనుకోవచ్చు. వీడెవడు తన్నడానికి కొట్టడానికి. చూస్తానుగా వీడికథ.

## ఏడవ రంగము

(జగ్గయ్య. చారుమతి. కళావతి)

కళా:- ఏమోయ్, మీ అయ్యగారున్నారా యింట్లో ?

జగ్గ:- ఉన్నారండి, ఉండకేం,

కళా:- మేం వొచ్చామని చెప్తావు !

(జగ్గయ్య నిష్క్రమిస్తాడు)

## ఎనిమిదవ రంగము

(చారుమతి, కళావతి)

చారు:- నాకెల్లాగోవుంది. ఇక్కడికి రావడమంటే యేదో భయ గావుంది.

కళా:- ఎందుకు తల్లీ భయం. పంచూసి.

చారు:- నన్నడగడం యెందుకు నీకు తెలియదు. ఉరితీయటానికి తీసుకెళ్ళుతుంటే యెలాఉంటుందో అలావున్నది.

కళా:- నిజమేనమ్మా. హనుమంతయ్యా యేమి తక్కువ వాడు కాదు. అయినా ఆయనకాదు నీకు ఆందోళన కలిగిస్తున్నది. నీవు ప్రేమించిన ఆపిల్లవాడు జ్ఞాపకం వచ్చి వుంటాడు.

చారు:- నేను కాదనను. అదీ నిజమే. ఆయన యెన్నోసార్లు మా యింటికి వచ్చారు. వచ్చినప్పుడు చూపించిన మర్యాద, మంచితనం, ఎంత ముచ్చటైన మనిషి!

కళా:— ఇంతకీ అతడెవరో కనుక్కున్నారా?

చారు:- లేదు, ఆయన ఎవరో నాకు తెలియదు. కాని ఆయన మంచివారని, ప్రేమించ తగినవాడని మాత్రం తెలుసు. నాకు నిర్బంధంలేక, నా యిష్టంవచ్చినట్టు చేయనిస్తే ఆయన్నే పెళ్లి చేసుకుంటా. అదంతా జ్ఞాపకంవచ్చే యిప్పుడు యీ ఆందోళన, భయమూను.

కళా:— ఈ పడుచువారంతా ఒకటేనమ్మా. యెర్రగా, బుర్రగా ఉండి తియ్యని మాటలు చెప్పుతారు. కాని చిల్లికవ్వైనా ఉన్నవాళ్ళుకారు. అకాడికి, బాగా డబ్బుగల పెద్దసారు వాడిని చేసుకుంటేపోయి. పెద్దవాడంటే కొత్తలో కొంత కష్టమే. తాస్త అలవాటు కావాలి. అయినా అట్టేకాలం బ్రతకడు. ఆతర్వాత మళ్లీ నీకు నచ్చినవాణ్ణి పెళ్ళి చేసుకోవచ్చు.

చారు:- బాగుంది. ఒకరి సౌఖ్యం ఇంకొకరి చావుమీద ఆధారపడి ఉంటుంది. ఇది లోకం తీరు. అయితే చావుమటుకు మనం కోరినప్పుడు వస్తుందా.

కళా:— అదేమ్మాట! చేసుకున్న కొద్దిరోజులలోనే పోతాడనే నమ్మకంతోనే యీ పెండ్లికి వప్పుకోడం. అదీ స్పష్టంగా తేల్చుకోవాలి. అదేపనిగా బతకడానికి పిల్లేను. ఇదిగో ఇటేవస్తున్నాడు.

చారు:- కళావతీ ఇదేమిటి. యిల్లా ఉన్నాడు యీయన!

## తొమ్మిదవ రంగము

(హనుమంతయ్య, చారుమతి, కళావతి)

(హనుమంతయ్య వస్తూ)

హను. (చారుమతితో) కండ్లజోడు పెట్టుకొచ్చానని కోపంగా వుందా? నీఅందం చూడ్డానికి జోడక్కర్లేదని తెలుసు నాకు. అయినా ఆకాశం మీది చక్కని చుక్కలని జోడె ట్టుకు చూస్తారు గనుక, యీచక్కని చుక్కని కూడా అట్లాగే చూద్దామని పెట్టుకొచ్చా. ఏం కళావతి! మాట్లాడదేం? నేనంటే యిష్టం లేదా యేమిటి?

కళా:— కొత్తగాదుటండి. చిన్న పిల్లగనుక సిగ్గు.

హను:—అవును. (చారుమతితో) ఇదుగో మా అమ్మాయి సుందరి వస్తున్నది నీకోసం.

## పదవ రంగము

(హనుమంతయ్య, సుందరి, చారుమతి, కళావతి)

చారు:— మిమ్మల్ని యెన్నడోవచ్చి చూచి ఉండాలిసింది. రాక పోవడం నాదేతప్పు.

సుం:— మీదికాదు. నేనే వచ్చి మిమ్మల్ని చూచివుండాలిసింది.

హను:- ఇప్పుడంతా మర్యాదగా మాట్లాడే వాళ్ళే. తరవాతే తగాదాలు.

చారు:— (కళావతితో రహస్యంగా) యేమిటీయన యింత అస హ్యాంగా ఉన్నాడు ?

హను:- (కళావతితో రహస్యంగా) యేమిటా రహస్యం ?

కళా:— యేముంది. మీరెంతో చేవగా ఉన్నారట.

హను:- నా బంగారపు చిలక !

కళా:— (తనలో) అబ్బ, యెక్కడో పశువులాగున్నాడే !

హను:— నీవన్నమాటలు వింటే యెంతో ఆనందంగావుంది.

చారు:— (తనలో) నేనింక కూర్చోలేను యిక్కడ.

## పదకొండవ రంగము

(హనుమంతయ్య, చారుమతి, సుందరి, కళావతి, చక్రపాణి, భూషయ్య)

(చక్రపాణి, భూషయ్య ప్రవేశిస్తారు)

హను:- ఇదుగో మా అబ్బాయికూడా వస్తున్నాడు.

చారు:— (కళావతితో రహస్యంగా) నీతో చెప్పానే, యీ వచ్చే ఆయనే. ఇక్కడ కలుసుకున్నామే !

కళా:— (చారుమతితో) చాలా గమ్మత్తుగా ఉందే యిది.

హను:- ఇంత యెదగిన పిల్లలున్నారే నాకని అంటున్నదా. ఒకరి తరవాత ఒకరిని త్వరలోనే సాగనంపుతానని చెప్పు.

చక్ర:— (చారుమతితో) చారుమతీ ! మీరిక్కడకు రావడం ఆశ్చర్యంగా ఉందే. నాకేమి యిష్టంలేదు. ఇందాకే మానాన్న చెప్పుతున్నాడు, ఆయన చేయదలచుకొన్న పని.

చారు:— మీకెంత ఆశ్చర్యంగా వున్నదో నాకూ అంత ఆశ్చర్యంగానే ఉంది. నే నేం చేసేది. నా నెత్తిమీదికి తెచ్చిపెట్టారిది.

చక్ర:— మానాన్న వేరే సంబంధం తలపెట్టితే నాకెక్కువ సంతోషంగా ఉండేది. మీరు నాకు సవతితల్లి అవబోతున్నారంటే సంతోషిస్తున్నానని చెప్పలేను. మిమ్మల్ని అమ్మా అని పిలవడం నాకిష్టంలేదు. నే నిట్లా మాట్లాడుతుంటే కొందరికి యిష్టం లేకపోవచ్చు. కాని మీకుమాత్రం కోపం రాదనుకుంటాను. ఈ పెండ్లి నాకు యేవగింపుగా వుంది. నా ఆశకు భంగం కలిగిస్తున్నది. మీకూ తెలియకపోదు. మీకు కోపం రాకపోతే ఒక్కమాట చెప్పుతాను. మా తండ్రిగారి ఆజ్ఞఅయితే యీ సంబంధం వెంటనే మానిపిస్తాను.

హను:-ఇల్లాగేనా ఆమెతో మాట్లాడవలసింది. నీకేం బుద్ధిలేదు.

చారు:-ఇదుగో మీరన్నదానికి జవాబు. మీకు నన్ను అమ్మ అని పిలవాలని లేదన్నారు. మిమ్మల్ని అబ్బాయి అని పిలవాలని నాకూలేదు. మీకు సవతితల్లి నవుదామని నేనూ తొందర పడడంలేదు. ఈ సంబంధం మీకెంతఅసహ్యమో నాకూ అంత అసహ్యం. నన్నెవ్వరు బలవంతపెట్టకుండా,

నా యిష్టంవచ్చినట్టు చేయనిస్తే మీకిష్టంలేని యీ పెళ్ళి యిప్పుడే ఆగిపోయేట్టు చేస్తాను.

హాను:-నీకు తగినట్టు చెప్పింది జవాబు. చారుమతీ! వాడి మాటలకు లెఖ్ఖచెయ్యకు. వాడు కుర్రకుంక. వాడు యేం మాట్లాడుతున్నాడో వాడికే తెలియదు.

చారు:-ఆయన అన్నదానికి నాకు కోపంలేదు. సరే గదా నాకు యెంతో సంతోషం కలిగింది. ఇల్లా మాట్లాడకపోతే నాకు కోపం వచ్చేది.

హాను:-ఎంత మంచిదానివి గనకనో, ఇన్ని మాటలన్నా వాడిని క్షమించావు. నిన్ను చూసైనా బుద్ధిమార్చుకుంటాడేమో లే.

చక్ర:- నాన్నా! ఈవిషయంలో మాత్రం ఎప్పుడు రాదని జ్ఞాపకం ఉంచుకో! ఈమాట నీకేగాదు ఆమెకు కూడా చెప్పుతున్నాను.

హాను:-యేమిటీ మొండివేషం, నీకేమైనా పిచ్చెక్కిందా!

చక్ర:- నా మనస్సులో ఉన్నదానికి వ్యతిరేకంగా చెప్పమంటావా.

హాను:-అదుగో, మళ్ళీ మొదటికొస్తున్నావు. చాల్లే, వేరే సంగతి మాట్లాడు.

చక్ర:- అన్నీ తయారుగానే ఉన్నాయ్ నాన్నా. హోటలునుంచి నాలుగు స్వీట్లు, నాలుగు కారం నీవు తెమ్మన్నావని తెప్పించాను.

హను:-(సుదర్శనంతో) సుదర్శనం.

సుద:- (హనుమంతయ్యతో) అబ్బాయికి మతిపోయినట్టుంది.

చక్ర:- చాలవంటున్నావా యేమిటి నాన్న, అయితే యింకా తెప్పించనా?

చారు:-ఏమి అక్కర్లేదండి, శ్రమపడకండి.

చక్ర:- మా నాన్న వేలికున్న రవ్వుంగరం లాంటిది యెక్కడైనా చూశారా. ఎలా తళతళ్లాడుతుందో.

చారు:-అవునండి, చాలా మెరిసిపోతూంది.

చక్ర:- (హనుమంతయ్య వేలినుంచి తీసి చారుమతికిస్తూ) దగ్గర నుంచి చూడాలి.

చారు:-నిజంగా ఎంత బాగుంది! ఎంత కాంతో!

చక్ర:- (హనుమంతయ్యకు తిరిగి యివ్వబోతుంటే యెదురుగా వచ్చి నిలుచుని) ఈ ఉంగరం ఉండవలసిన చేతుల్లోవుంది. మా నాన్న మిమ్మల్ని పెట్టుకోమని యిచ్చాడు.

హను:-నేనా?

చక్ర:- ఆమెకియ్యమని నీవేగా నాన్నా చెప్పింది.

హను:-(చక్రపాణితో మెల్లిగా) యేమిట్రా యిది?

చక్ర:- (చారుమతితో) ఇది మరీబాగుందే. మిమ్మల్ని తీసుకునే ట్టు చెయ్యమని సంజ్ఞ చేస్తున్నాడు.

చారు:-ఎందుకులెండి...

చక్ర:- (చారుమతితో) హాస్యాని కనుకున్నారా? నిజంగానే యిచ్చాను. మానాన్న మళ్ళీ తీసుకుంటాడనుకున్నారా.

హాను:-(తనలో) నావొళ్ళు మండిపోతున్నది.

చారు:-నాకెందుకండి యిప్పుడు...

చక్ర:- (చారుమతిని అడ్డుపెట్టుచు) జాగ్రత్త ఆయనకు కోపం తెప్పిస్తారు.

చారు:-ఇదుగో...

చక్ర:- ఉంచండి.

హాను:-(తనలో) వీడెక్కడ దాపరించాడురా.

చక్ర:- చూశారా. కోపం వస్తున్నది అప్పుడే.

హాను:-(చక్రపాణితో మెల్లిగా) దౌర్భాగ్యుడా.

చక్ర:- (చారుమతితో) అదుగో ఆగ్రహపడుతున్నాడు.

హాను:-(పండ్లుబిగించి కోపం ఆపుకుంటూ) నా కొంప తీస్తున్నావురా.

చక్ర:- నన్నేం చెయ్యమన్నావు నాన్నా? నీవే చూస్తున్నావుగా ఉంచుకోమంటే యెంతచెప్పినా ఒప్పుకోడంలేదు.

హాను:-(పట్టలేనంత కోపంతో) నీ మొహంమండ.

చక్ర:- మీమూలాన నేను తిట్లు తినాలిసొస్తున్నది.

హను:-(ఇదివరకు వలెనే) దొంగ...

చక్ర:- (చారుమతితో) ఒళ్ళు తెలియకుండా పడిపోతాడు. ఇవా ఇదంతా మీమూలానే జాగ్రత్త.

కళా:- (చారుమతితో) ఉంగరం ఉంచుకోరాదటమ్మా. ఇంత బతి మాలించుకోవాలా.

చారు:-(హనుమంతయ్యతో) మీకు కోపం తెప్పించాలని లేదు నాకు. ఉంగరం పెట్టుకుంటాను లెండి యిప్పుడు. కొంచెం సేపు అయినతరువాత మళ్ళీ మీది మీకిస్తాను.

## పదమూడవ రంగము

(హనుమంతయ్య, చారుమతి, సుందరి, చక్రపాణి, సుద ర్శనం, కళావతి, భూషయ్య)

(భూషయ్య వస్తూ)

భూష:-మీతో ఎవరో మాట్లాడాలని వచ్చాడండి.

హను:-పనిమీద ఉన్నానని చెప్పు. తరువాత ఎప్పుడైనా రమ్మను.

భూష:-డబ్బు తెచ్చాడటండి.

హను:-(చారుమతితో) ఇప్పుడే వస్తాను.

(హనుమంతయ్య నిష్క్రమిస్తాడు)

ప సి ని గొ ట్టు
సమోమ సంత్య ..........

## పదునాల్గవ రంగము..............

(హనుమంతయ్య, చారుమతి, సుందరి, చక్రపాణి, సుదర్శనం, కళావతి, జగ్గయ్య)

(జగ్గయ్య ప్రవేశించుచుండును)

(జగ్గయ్య హనుమంతయ్య తొందరలో ఒకరి నొకరు ఢీకొట్టుకొనగా హనుమంతయ్య క్రిందపడును)

జగ్గ:- అయ్యా, చూడలేదండి క్షమించండి.

**హను:-** అయ్యో చచ్చాన్రా!

చక్ర:- ఏమిటి నాన్నా, దెబ్బేమైనా తగిలిందా.

హను:- అదుగో వాడు నాకు బాకీఉన్న వాడెవడి దగ్గరో లంచం తిని నన్ను చంపాలని పడతోశాడు.

సుద:- (హనుమంతయ్యతో) మరేం ప్రమాదంలేదులెండి.

జగ్గ:- (హనుమంతయ్యతో) పరుగుమీదవచ్చి పనిచేసుకుపోదాం అనుకున్నాను బాబు.

**హను:-** ఇక్కడికెందుకు వచ్చినట్టురా నీవు?

జగ్గ:- గుర్రానికి నాడాలు లేవని చెప్పడానికి వచ్చానండి.

**హను:-** నాడాలు లేకపోతే వేసేచోటికి తీసుకుపో!

(జగ్గయ్య నిష్క్రమించును)

చక్ర:- గుర్రానికి నాడాలు వేసేదాకా వీరిని తోట్లోకి తీసుకు వెళ్ళుతా. కాఫీ, ఫలహారం అక్కడ చెయ్యవచ్చు.

(చక్రపాణి, చారుమతి, సుందరి, కళావతి నిష్క్రమిస్తారు)

## పదిహేనవ రంగము

(హనుమంతయ్య, సుదర్శనం)

హను:-సుదర్శనం! జాగ్రత్తోయ్, అన్నీ ఖర్చు కాకుండా చూడు. మిగిలినవి మళ్లా దుకాణంవాడికి తోసేద్దాం.

సుద:- చిత్తం. అల్లాగేనండి.

హను:-(ఒంటరిగా) నాకీ కొడుకెక్కడ దాపరించాడురా నాయనా. నాకొంపతీయడానికి.

---

# నాల్గవ అంకము

## ఒకటవ రంగము

(చక్రపాణి, చారుమతి, సుందరి, కళావతి)

చక్ర:- ఇక్కడ కూర్చుందాం రండి. ఇక్కడి కెవ్వరు రారు. నిర్భయంగా మాట్లాడుకోవచ్చును.

సుంద:-అవునమ్మా, మాఅన్నయ్య అన్నీ చెప్పాడు. నీవంటే అతని కెంతయిష్టమో నాకు తెలుసు. ఇటువంటి అడ్డంకులు వచ్చినప్పుడు మనసు చికాకు పడకమానదు. అయినా నీకు భయంలేదు. నేను మీకు సాయం చేస్తానుగా.

చారు:-నీవంటిది నాకు సహాయం చేస్తానంటే, ఇంతకంటె కావలసిందేముంది. నన్ను మీదాన్నిగా యెంచి, రక్షించాలి.

కళా:- ఎంతపొరపాటు చేశారమ్మా మీరు. నా కిదివరకే చెప్పినట్లయితే యేదో ఉపాయం చేసేదాన్ని గాని, యింతవరకు తెచ్చేదాన్నా.

చక్ర:- ఎవరి తప్పులేదు చెప్పకపోవడం. నాదురదృష్టం. చారుమతీ! నీవేం చేద్దామనుకుంటున్నావు?

చారు:-నేనేం చేయగలను? ఏపని స్వతంత్రించి చేయగల దాన్నిగాను. ఎవరైనా దోవచూపితే, నడుస్తాను.

చక్ర:- నాకోసం యింతకంటె ఏమీ చేయలేవు? నామీద కనికరంలేదు? దయలేదు? ఏదోఉపాయం కనిపెట్టేటంత ప్రేమలేదూ?

చారు:- నేనేమి చెప్పను మీరల్లా మాట్లాడితే! నాస్థితిలోనే మీరు ఉన్నారనుకోండి. అప్పుడేమి చేస్తారు? ఇప్పుడు మీకేది మంచిదనితోస్తుందో ఆలోచించి చెయ్యమని చెప్పండి చేస్తాను. పరువు ప్రతిష్ఠలకు భంగంవచ్చే పనిమాత్రం చేయించకండి.

చక్ర:- ఏమిటో యెప్పుడు పరువు పరువు అనే పాకులాడతావు. ఆమాట వినకుండా ఉంటే, నే నేఉపాయం చెప్పినా లాభం యేముంది ?

చారు:-మరి నన్నేం చెయ్యమన్నారు? నావంటివారికి తగని పని అయినా చేయడానికి నేను సిద్ధంగానే ఉన్నాననుకోండి. మా అమ్మ ఉందిగా. ఆమెకు మనస్తాపం కలిగించనా? ఆమె ఎన్ని కష్టాలోపడి చిన్నప్పటినుంచి నన్ను పెంచి పెద్దదాన్ని చేసింది. ఆమెకు బాధకలిగించడం యిష్టం లేదు. మీరు ఆమెతో మాట్లాడండి. ఆమెను ఒప్పించండి. నావిషయంలో మీరెల్లా మాట్లాడినా నాకిష్టమే. నేను మిమ్మల్ని ఎంతగా ప్రేమిస్తున్నానో ఆమెపై ప్రమాణం చేసి చెప్పమన్నా చెప్పుతాను.

చక్ర:- కళావతీ! మాకేమైనా కొంచెం సాయం చెయ్యలేవూ?

కళా:- అడగాలా నాయనా? నా చేతైతే తప్పక చేసిపెడతాను. నేనేం రాతిగుండె నుండనుకోను. ముచ్చటగా ఒకరి నొకరు ప్రేమించి పెళ్ళి చేసికుందా మనుకుంటే వద్దని అడ్డంపడతానా నేను! ఏం చేయగలనా అని చూస్తున్నా.

చక్ర:- కాస్త శ్రద్ధగా ఆలోచన చెయ్యి.

చారు:-మమ్మల్ని ఏం చెయ్యమంటావో చెప్పు.

సుంద:-ఇంతవరకు తెచ్చింది నీవుగనక, బయట పడెయ్యడం కూడా నీవంతే.

కళా:- అది తేలికా తల్లీ! (చారుమతితో) మీ అమ్మకు నచ్చ చెప్పి తండ్రికి ఇవ్వదలచుకున్న పిల్లను కొడుక్కి ఇవ్వడా నికి ఒప్పించడం సులభమే. (చక్రపాణితో) ఎటొచ్చి మీ నాయనే కొరుకుపడని కొయ్య.

చక్ర:- అదే ఒచ్చినచిక్కు.

కళా:- పిల్ల అయనను పెళ్ళిచేసికోనని అంటే, ఆ కోపంతో నన్ను కూడా ఆపిల్లని చేసుకోడానికి ఒప్పుకోడు. కాబట్టి ఈ పెళ్ళిమీద ఆయనకే అయిష్టం పుట్టేట్టు చెయ్యాలి.

చక్ర:- మంచి ఉపాయమే అది.

కళా:- ఔను,మంచి ఉపాయమే. నాకు తెలుసు, ఆయన సంగతి. కాని ఎల్లా చేయడం ? ఆ సంగతి ఆలోచించాలి. ఎవ రైనా నా యీడు నా తెలివిగల ఆడమనిషి దొరకాలి.

ఆమెను హాంగుగా అంతా తయారుచేసి, యేదో జమీం దారీ కుటుంబం మనిషిలాగ వేషం వెయ్యాలి. ఆమె ఉత్తరాది నుండి వచ్చిందని, ఆమె దగ్గర లక్షరూపాయలు రొఖ్ఖం ఉందని, మీ నాన్నని తప్ప యెవ్వరిని పెళ్ళి చేసుకోనంటూందని, పెండ్లి కాగానే ఆ లక్షరూపాయలు ఆయనకే యిస్తుందని చెప్పితే, మీ నాన్న, ఇహ వెనకా ముందూ చూడడు. ఈ పన్నాగంలో పడతాడని నమ్మ కంగా తోస్తున్నది ఏమాట కామాటే చారుమతిఅంటే ఆయనకిష్టమే. కాని డబ్బంటే చారుమతికంటె యిష్టం. తనకి ఇంత పెద్ద సంబంధం కనబడుతుంటే,నీవు చారుమతిని చేసుకోడానికి అంగీకరిస్తాడు. మీ పెండ్లిఅయిపోయినతరు వాత, ఆ సంబంధం సంగతి నిజమో అబద్ధమో యేమైతే మనకేం. యేమంటావు, బాగుందా ?

చక్ర:- ఎంత చక్కగా అల్లావు ? కళావతి !

కళా:- నా స్నేహితురాలొకామె ఉండాలి. జ్ఞాపకం వస్తున్నది. ఆమైతే, ఇదంతా చక్కగా కుదురుతుంది.

చక్ర:- ఈ పని చేసిపెట్టావా కళావతీ ! నేను బతికున్నంత కాలం నీ మేలు మరవను. చారుమతి ! మనం పోయి మీ అమ్మగారితో ముందు మాట్లాడదాం. ఈ సంబంధం వదిలించుకోవాలిగా. నువ్వు బాగా ఉత్సాహంగా ప్రయ త్నంచేస్తే తప్ప వీల్లేదు. నీమీద మీ అమ్మకు జాలి పుట్టే టట్టు మాట్లాడాలి. భగవంతుడు నీ కిచ్చిన ఆ అందమైన

కళ్లను, ఆ సుకుమారమైన పెదవులను, నీ లావణ్యాన్ని, నీ తెలివి తేటలను అన్నింటినీ ఉపయోగించు. దేవుడు ఆడవారికి యిచ్చిన వశీకరణ శక్తులన్నీ ఉపయోగించి పని సాధించాలి.

చారు:- ఇందులో మాటమాట జ్ఞాపకం ఉంచుకుంటాను. నాశక్తి వంచన లేకుండా చేస్తాను. సరేనా,

## రెండవ రంగము

(హనుమంతయ్య, చక్రపాణి, చారుమతి, సుందరి, కళావతి)

(హనుమంతయ్య వస్తూ)

హను:-(తనలో వినబడకుండా) ఏమిటి, మావాడు ఆ అమ్మాయి మొహంలో మొహంపెట్టి గుసగుసలాడుతున్నాడు. ఆ అమ్మాయికూడా ఊరుకున్నట్టే ఉన్నదే. దీనిలో యేదైనా రహస్యం లేదుగదా!

సుం:- అడుగో నాన్న. రా నాన్నా!

హను:-గుర్రపుబండి సిద్ధంగా ఉంది. మీ రెప్పుడెళ్ళినా వెళ్లొచ్చు.

చక్ర:- నీవు వాళ్లతో వెళ్లడంలేదు గనక, నేను వెళ్లనా నాన్నా?

హను:-వద్దు. నువ్వు ఇక్కడే ఉండు. వాళ్లు వెళ్ళి వస్తారులే. నీతో నాకు పనుంది.

(సుందరి, చారుమతి, కళావతి నిష్క్రమిస్తారు)

## మూడవ రంగము

(హనుమంతయ్య, చక్రపాణి)

హను:-నీకు సవితి తల్లి అవుతుందనే మాట అల్లా ఉంచి, ఆమెను గురించి అసలు నీ అభిప్రాయం యేమిటో చెప్పు.

చక్ర:- నా అభిప్రాయమా ?

హను:-అవును. ఆ పిల్ల తరహా, తీరు, అందం, తెలివితేటలు ఎలా ఉన్నాయి నీకు ?

చక్ర:- ఉన్నాయి !...బాగానే ఉన్నాయి.

హను:-నేనడిగిందానికి అది సమాధానం కాదు.

చక్ర:- అల్లాగైతే ఉన్నదున్నట్టు చెప్పమన్నావా? నేననుకున్నంత బాగుండలేదు— ఆ అమ్మాయి. అందం అంతంత మాత్రం. మనిషిలో కుదురు లేదు. బుద్ధి చురుకుతనమూ కనబడడంలేదు. కాకపోతే, కులుకు మటుకు కావలసిన దానికన్నా ఎక్కువగా ఉంది. నీకు ఆమెమీద విరక్తి పుట్టాలని చెప్పుతున్నాననుకోకు. సవిత్తల్లే అంటు ఉండాలిపొస్తే మిగిలిన ఆడవాళ్ల కంటే ఆమే నయం.

హను:-మరి, యిప్పుడేగా నీవు ఆమెతో...

చక్ర:- యేవో యిచ్చకం మాటలు చెప్పినమాట నిజమే. అవన్నీ నీ కోసమే.

హను:-అయితే చారుమతి అంటే నీ కిష్టం లేదన్నమాటేనా ?

చక్ర:— ముమ్మాటికి.

హాను:-అయితే నే ననుకున్నదేం లాభంలేదు. ఆ అమ్మాయిని చూసిన తరువాత ఆలోచన ఒకటి తట్టింది. పెద్దవాడిని గదా ఆ చిన్నపిల్లను చేసుకుంటే నలుగురు ఏమంటారో అని జంకాను. పోనీ, నాకు కాకపోతే నీకైనా యిచ్చి చేద్దామనుకుంటే నీకు యిష్టం లేదంటున్నావు.

చక్ర:— నాకిచ్చి చేద్దామనుకొన్నావు?

హాను:-ఔను.

చక్ర:— పెళ్లే ?

హాను:-ఔనురా అంటూంటే !

చక్ర:— పిల్లనుచూస్తే అంత పొడిచేసేట్టులేదు గాని, నిన్ను సంతోష పెట్టడానికి చేసుకోడానికి సిద్ధంగానే ఉన్నా.

హాను:-నేనేం మూర్ఖుడి ననుకున్నావేంరా! ఇష్టంలేదంటూంటే బలవంతంగా కట్టపెడతానా ?

చక్ర:— బలవంతమేమిట్లే. నీ కిష్టమైతే చేసుకోనన్నానా ?

హాను:-అల్లా కాదోయ్. పెండ్లనేది యిష్టంమీద జరగాలి గాని, నాన్న చెప్పాడని, అమ్మ చెప్పిందని చేసుకోకూడదు. తెలిసిందా,

చక్ర:— దానికేం నాన్న. పెళ్లయిన తరువాత మెల్లగా ప్రేమించ కూడదా.

హాను:-అలా అనడానికి వీలులేదు. అందులో మొగవాడు అల్లా అనుకోకూడదు. ప్రేమించకుండా పెళ్లాడాడంటే వాడి అగచాట్లు యింతంతగాదు. పిల్లమీద యిష్ట ముందని అని వుంటే, అది వేరే మాట. నీకు తప్పక ఆ పిల్లని కట్టి ఉంమను. ఈ సందర్భాల్లో, ఆ పిల్లను నేను చేసుకోనక తప్పేట్టు కనబడవం లేదు.

చక్ర:- నీవంతగా చెప్పుతున్నావు గనక, నాన్నా, నేను ఉన్న సంగతి చెప్పక తప్పదు. కొంతకాలం కింద చారుమతిని నేను చూసినప్పటినుంచి ఆమెను ప్రేమించాను. నీకు కోపం వస్తుందేమోనని ఆగాను గాని, లేకపోతే యెప్పుడో నన్ను చేసుకోమని అడిగేవాడిని.

హాను:-అయితే వాళ్ల యింటికి తరుచు వెళ్లేవాడివా!

చక్ర:- ఆఁ!

హాను:-చాలాసార్లా ?

చక్ర:- మేము కలుసుకున్నది యీ మధ్యనేగాని, అయినా చాలాసార్లన్నమాటే.

హాను:-నిన్ను బాగా చూశారా ?

చక్ర:- ఎంతో గౌరవంగా చూశారు. నేను ఫలానా అని యెరగ కుండానే మర్యాద చేశారు. అందుకే, నన్ను యిక్కడ చూసి చారుమతి అంత ఆశ్చర్యపోయింది.

హాను:-నీ కామెను గురించి ఉన్న అభిప్రాయం వాళ్లకు చెప్పి, పెళ్లి చేసుకుంటానని కూడా చెప్పావా?

చక్ర:- చెప్పాను. చారుమతి తల్లితోగూడా చెప్పాను.

హాను:-ఆమె సుముఖంగా ఉన్నదా ?

చక్ర:- ఉన్నట్టే కనబడ్డది.

హాను:-చారుమతికి నీవంటే యిష్టమేనా ?

చక్ర:- ఆమె కనబడేదాన్నిబట్టి చూస్తే, యిష్టమే నన్నట్టు తోస్తుంది.

హాను:-(తనలో మెల్లగా) పిల్ల రహస్య మిదా. ఇది కనుక్కుందామనేగా మరి! (ప్రకాశముగా) ఒరే చక్రపాణి! ఇహ నీవేం చేయాలో తెలుసా ? చారుమతిని తల్లిలాగా చూసుకోవాలి. గుస గుసలు, మొహంలో మొహం పెట్టి మాట్లాడ్డం కట్టిపెట్టాలి. ఆ పిల్లను నేను చేసుకుంటున్నా. నీకు రాసిపెట్టి ఉన్నపిల్లను నీకు చేస్తా.

చక్ర:- ఆఖరుకు యిదా నీవు చేసిన టక్కరితనం! నువ్వెన్ని చెప్పినా సరే, చారుమతినిమాత్రం నేను విడిచిపెట్టను. ఆ పిల్లను నువ్వు పెళ్లి చేసుకోటానికి వీల్లేదు. తల్లి నీవైపు ఉన్నదిగదా అని సంతోషిస్తున్నావేమో. నా వైపు ఉన్నవాళ్లు నాకూ వున్నారు. చూద్దాం ఏం జరుగుతుందో!

హాను:-ఛీ ! దుర్మార్గుడా ! నా కడ్డ మొస్తానంటావ్.

చక్ర:— నీవూ నాకు అడ్డం వస్తున్నది. చారుమతిని మొదట నేను చూచింది, ప్రేమించిందీని.

హాను:-నేను నీ తండ్రిని గాన్కుట్రా ? యిదేనా తండ్రికి చేసే గౌరవం:

చక్ర:— ఇలాంటి పరిస్థితిలో కొడుకు తండ్రి కేమి గౌరవం చూపించక్క ర్లేదు. ప్రేమనేది మనుష్యులను లెఖ్ఖ చేయదు.

హాను:-లెఖ్ఖ చెయ్యదు? చేసేట్టుచేస్తాను చూడు. కర్రతీసుకొని...

చక్ర:— అదేం లాభంలేదు.

హాను:-చారుమతిని నీవు వదిలిపెట్టాలి.

చక్ర:— నేను వదిలిపెట్టను.

హాను:-పదిరా కర్ర.........

## నాల్గవ రంగము

(హనుమంతయ్య, చక్రపాణి, జగ్గయ్య)

(జగ్గయ్య వస్తూ)

జగ్గ:— ఇదేంటి బాబు !

చక్ర:- నాకేం భయమనుకున్నావా యేమిటి ?

జగ్గ:— (చక్రపాణితో) ఊరుకోండి బాబు.

హాను:-ఇట్లాగేనా నాతో మాట్లాడేది. పొగరుబోతు తనం.

జగ్గ:- (హానుమంతయ్యతో) మీరు తగ్గండి బాబు.

హాను:-నేను తగ్గను.

జగ్గ:- (చక్రపాణితో) ఏంటిబాబు, ముసలాయన మీదికి లేస్తారా?

హాను:-వదిలిపెట్టరా నన్ను.

జగ్గ:- (హానుమంతయ్యతో) ఇదేంటి బాబు, అబ్బాయి గారినే. తెలియకంటే యింత కోపమైతే యెల్లాబాబు.

హాను:-నాకేం తెలియదనుకున్నావా! యేమిట్రా మధ్య నీవు జోక్యం కలగ జేసుకోకు. అన్యాయం, న్యాయం నాకు తెలుసు. వీడికేం తెలుసు.

జగ్గ:- చిత్తం బాబు! (చక్రపాణితో) కాస్త దూరంగా పొండి.

హాను:-నేనొక పిల్లను తెచ్చి పెళ్లి చేసుకుందామంటే, ఆ పిల్లను కాస్తా వీడు చేసుకుంటా నంటాడూ? చిలక్కు చెప్పి నట్లు చెపితే—వినడేం?

జగ్గ:- అది తప్పుగాదు బాబూ!

హాను:-ఇంతకంటె ఘోరం ఉందా! తండ్రి పెళ్ళికి కొడుకు అడ్డం తగలొచ్చా? చెప్పరా. నిన్ను మధ్యవర్తిగా నేను ఒప్పుకుంటాను, చెప్పు.

జగ్గ:- చిత్తం తప్పేనండి. అబ్బాయిగారితో నన్ను కాస్త మాట్లాడ నియ్యండి.

చక్ర:- (దగ్గరకు వస్తున్న జగ్గయ్యతో) మా తగాదా నిన్ను తీర్చమన్నాడు గనుక అయన, పోనీ నువ్వే న్యాయంచెప్పు. నేను ఒప్పుకుంటా.

జగ్గ:- భేష్ బాగా చెప్పారు అబ్బాయిగారు. ఇక మీరు చెప్పేది చెప్పెయ్యండి.

చక్ర:- నేనొక పిల్లను ప్రేమించాను. తెలిసిందా? ఆ పిల్లకూడ నన్ను ప్రేమించింది. మేమిద్దరం పెళ్లి చేసుకుందామనుకుంటే, యీాయన మధ్యవచ్చి ఆ పిల్లను తనే పెళ్ళి చేసుకుందామని చూస్తున్నాడు.

జగ్గ:- ఘోరం, ఘోరం.

చక్ర:- అంత ముసలివాడికి అసలు పెండ్లెందుకంటా! ఆయన రోజులైపోయినైగా, మమ్మల్ని బ్రతకనియ్యరాదు! మా యిష్టమొచ్చినట్లు పోయిగా.

జగ్గ:- భేష్! నిప్పులాంటిమాట. ముసలాయను త్తినే మాట్లాడుతున్నారు బాబు! నన్ను మాట్లాడనియ్యండి. (హనుమంతయ్యతో) ఏది బాబూ! అబ్బాయిగారు మీరన్నంత మొండిగా లేరే. మీరంటే భయమే! కోపంలో ఉత్తినే అన్నానన్నారు. మీ యిష్టమొచ్చినట్టే చెయ్యమన్నారు. ఆయనకుకూడా ఒక పిల్లనుచూసి పెళ్లి చేస్తే చాలన్నారు.

హాను:-అల్లా దోవకొస్తే లేందేవుంది. నీవు పోయి, వాడి కేమి లోటు చేయనని చెప్పు. ఆ పిల్లను తప్ప వాడికి ఇంక ఏది కావలసినా యిస్తానని చెప్పు.

జగ్గ:— నేను సరే అనిపించుకొస్తాగా. (చక్రపాణితో) మీరన్నంత అన్యాయం కాదండి అయ్యగారు. మీ కోపం చూసి. ఆయనకూ కోపం వచ్చిందట. అంతేగాని కొంచెం అణుకువగా తండ్రి కొడుకు లున్నట్టు ఉంటే ఆయన చెయ్యానన్నది లేదట. మీ యిష్టంవచ్చినట్టే చేస్తానన్నారు.

చక్ర:- చారుమతిని నన్ను చేసుకోనిస్తే ఆయన్ని పూలలో పెట్టి పూజిస్తానని చెప్పు. ఆయన గీచినగీటు దాటను. సరేనా.

జగ్గ:— (హనుమంతయ్యతో) ఇంకేం బాబు. మీరన్నదానికి అబ్బాయిగారు సరేనన్నారు.

హను:-అయితే జరగాలిసినవన్నీ ఇక సక్రమంగా జరుగుతై.

చక్ర:- బతికాముురా భగవంతుడా.

జగ్గ:— పోట్లాట అయిపోయిందిగా. ఇక మీరిద్దరు అన్నిసంగతులు మాట్లాడుకోండి.

చక్ర:- జగ్గయ్యా! నీవు చేసిన మేలు మరిచి పోనోయ్.

జగ్గ:— నేనేం చేశా బాబు? అన్నీ మీరే చేసుకొన్నారు.

హను:—నీవంటే నాకు యిష్టం కలిగింది. నీకేదైనా బహుమానం యివ్వాలి, ఉండు. (హనుమంతయ్యా జేబులు తడువు కొనును. జగ్గయ్య చెయ్యిచాచును. హనుమంతయ్య జేబురుమాలు తీయును.) పోయిరా చూస్తాగా.

జగ్గ:— చిత్తం బాబు.

(జగ్గయ్య నిష్క్రమిస్తాడు.)

## ఐదవ రంగము

(హనుమంతయ్య, చక్రపాణి)

చక్ర:— నాన్నా! నేనేదో కోపం మీద మాట్లాడేశాను. క్షమించు.

హను:-దానికేంలే.

చక్ర:— నేనన్న మాటలకు చాలా విచారంగా ఉన్నది.

హను:-దోవకు వచ్చినందుకు నాకు చాలా సంతోషం.

చక్ర:— నాతప్పు యింత త్వరగా క్షమించినందుకు నాకూ సంతోషంగా ఉంది.

హను:- పిల్లలు చేసిన తప్పులు తండ్రులు క్షమించకపోతే ఎల్లా.

చక్ర:- నేను డబ్బు వృథాగా ఖర్చుచేశానని కోపంగాలేదుగదా!

హను:-నీ ప్రవర్తన మారగానే అన్నికోపాలు పోయినై.

చక్ర:- నాన్నా! నీవు చూపించిన దయ యీ జన్మలో మరవలేను.

హను:-ఇకనుంచి నీకేం కావలసివస్తే అదియిస్తా.

చక్ర:- నాకేం కావాలి నాన్నా ? నా చారుమతిని నాకు ఇచ్చావు, చాలు. ఇంక నాకేం అక్కరలేదు.

హను:-ఏమిటి ?

చక్ర:- నేను చారుమతిని పెళ్లిచేసుకోటానికి ఒప్పుకున్నావు గనక, అన్నీ యిచ్చినట్టే నాకు. ఇంక నాకు కొరత యేమీ లేదు.

హాను:-ఏమిటీ? చారుమతిని నువ్వు పెళ్లిచేసుకోటానికి ఎవరురా ఒప్పుకుంది?

చక్ర:- నీవేగా.

హాను:-నేనా.

చక్ర:- అదేమిటి నాన్న, యిప్పుడేగా అన్నది.

హాను:-నీవు కాదూ, చారుమతి నాకక్కర్లేదు నువ్వే చేసుకో నాన్నా అన్నది.

చక్ర:- నేనా, చారుమతిని వద్దన్నది.

హాను:-అవును.

చక్ర:- నేనెన్నడు అనలేదు.

హాను:-అయితే నీపట్టు విడవనట్టేనా.

చక్ర:- ఇదివరకక్కంటే యెక్కువ పట్టు పడుతున్నాను.

హాను:-మళ్ళీ మొదటికొచ్చావురా! చండాలుడా.

చక్ర:- నామనస్సు మారడమంటూ వుండదు.

హాను:-అలా అయితే యేది, నిన్ను పట్టుకొని......

చక్ర:- నీ యిష్టమొచ్చినట్టు చెయ్యి.

హాను:-ఈక్షణంనుంచి నాకంటికి కనబడవద్దు.

చక్ర:- ఓ, అలాగే.

హను:-నీకూ నాకు తెగతెంపులే. నీవు నాకొడుకువు గావు, నేను నీకు తండ్రినీ గాను.

చక్ర:- కానీ.

హను:-నా ఆస్తిలో నీకు చిల్లిగవ్వ ఇవ్వను.

చక్ర:- నీయిష్టమొచ్చినట్టు చెయ్యి.

హను:-నా ఉసురుకొట్టిపోతావ్ !

చక్ర:- పోతే పోతాలే !

(హనుమంతయ్య నిష్క్రమిస్తాడు)

## ఆరవ రంగము

(చక్రపాణి, లక్ష్మయ్య)

లక్ష్మ:- (తోటలో నుంచి పెట్టె చంకని పెట్టుకొని వస్తూ) సమయానికి కనపడ్డారు. నాతో రండి త్వరగా.

చక్ర:- ఏమిట్రూ ! అది.

లక్ష్మ:- నాతో రమ్మన్నాగా. వచ్చేయండి త్వరగా...ఫరవా లేదు రండి.

చక్ర:- ఏమిటది ?

లక్ష్మ:- మీ వ్యవహారమే.

చక్ర:- నా వ్యవహారమేమిటి?

లక్ష్మి:- రోజల్లా కన్ను వేసే ఉంచా.

చక్ర:- దేనిమీద?

లక్ష్మి:- ముసిలాయన డబ్బుమీద. ఇదుగో!

చక్ర:- ఎల్లా తెచ్చావ్?

లక్ష్మి:- చెపుతాగా. ఆయన అరుపులు వినబడుతున్నాయి. పారిపోదాం రాండి.

(ఇద్దరు నిష్క్రమిస్తారు.)

## ఏడవ రంగము

(హనుమంతయ్య- కేకలు, పెడబొబ్బలు పెడుతూ తోటలోకి వస్తూ)

దొంగలు, దొంగలు, అమ్మో చంపుతున్నారు. పట్టుకోండి. దేవుడా రక్షించు! నా పనైపోయింది. నన్ను చంపేశారు. నా గొంతు కోశారు. నా సొమ్ము కాజేశారు. ఎవరు తీశుంటారో? ఏమయాడు వాడు? ఏడీ? ఎక్కడున్నాడు? ఎక్కడ వెతకను? ఎటు పరుగెత్తను? ఎటు పరుగెత్తకుండా ఉండను? అక్కడ లేడు వాడు? ఎవడ్రా నీవు? ఆగు. (తన చేతినే పట్టుకొని) నా డబ్బు నాకియ్యి. అయ్యో! యిది నా చెయ్యేనే! నాకు మతిపోతున్నట్టుందే? నే నెవ్వడిని? యెక్కడున్నాను? అయ్యో నా ధనం! అయ్యో నా డబ్బు! యిక నేనేం చెయ్యాను? యెల్లా బతకడం? నా ధనం, నా ప్రాణం వెళ్లిపోయింది. ఇక బతకడం యెల్లా? నా పని అయి

పోయింది. నేను చచ్చిపోయాను. ఇక నన్ను పూడ్చిపెట్టేశారు. నా డబ్బు నాకిచ్చి నన్ను మళ్లీ బతికించే పుణ్యాత్ములు లేరూ ! ఏమంటున్నావు ? ఎవ్వరు లేరే ? ఎవడో పొంచి ఉండి ఆ దరిద్రుడితో పోట్లాడుతున్న సమయం కనిపెట్టి దాచేసుకుపోయాడు. పోదాం రండి ! పోలీసులతో చెపుదాం. ఈ ఇంట్లో వాళ్లందర్నీ సోదా చేయించాలి. ఆడ నౌకర్లు, మొగ నౌకర్లు, కొడుకు, కూతురు, ఆఖరికి నన్ను కూడా. ఏమిటి యీ సభ, యింతమంది ఉన్నారు ? ఎవరి మొహం చూసినా దొంగ మొహం లాగనే ఉంది. అక్కడ వాళ్లు మాట్లాడేదేమిటి ? దేన్ని గురించి ? డబ్బు కాజేసినవాడిని గురించా ? ఆ గోల యేమిటి ? నా దొంగను పట్టుకొన్నారా ? దొరికితే దయచేసి చెప్పండి బాబు, పుణ్యముంటుంది. మీలోనే ఉన్నాడు. మీలోనే దాక్కున్నాడు. అందరూ నన్ను చూసేవాళ్లే ! నన్ను చూసి నవ్వుతున్నారూ ? ఈ కూర్చున్న వాళ్లందరికి అందులో భాగం ఉంది. పోలీసులు, ఇన్‌స్పెక్టరుగారు, మేజిస్ట్రేటుగారు, రండి బాబూ రండి. లాటీలు, కత్తులు, సంకెళ్లు, కొరడాలూ అన్నీ తెండి బాబూ. ఉరితీసే వాళ్లని కూడా తీసుకురండి. ఈ ఊరందర్నీ ఉరి తీయిస్తా. అప్పటికీ డబ్బు దొరక్కపోతే నేనే ఉరిపోసుకుంటా.

---

# ఐదవ అంకము

## ఒకటవ రంగము

(ఇనస్పెక్టరు, హనుమంతయ్య)

ఇన:- ఈకేసును నాకొదిలెయ్యండి. నేను చేస్తాగా. ఇది మొదటిదా? ఇటువంటివెన్నో చూశాను.

హను:- అయ్యా, పోలీసులు! మీరు నాడబ్బు ఆచోకీ పట్టి యివ్వాలి. లేకపోతే పోలీసుల మీదకూడా వాజ్యంవేస్తా.

ఇన:- అల్లాగేలెండి. ముందు కేసు విచారించాలి. పెట్టెలో ఏమి ఉందన్నారూ?

హను:- పదివేల రూపాయిలు రొఖ్ఖం.

ఇన:- పదివేలే.

హను:- (ఏడుస్తూ) పదివేలు.

ఇన:- పెద్ద దోపిడే యిది.

హను:- ఇంత దొంగతనానికి తగిన శిక్ష వేయించాలి. లేకపోతే బతకలేము.

ఇన:- రొఖ్ఖం అంటే రూపాయిలా, నోట్లా?

హను:- వెండి రూపాయిలు, బంగారపు నవర్సులు.

ఇన:- మీ కెవరిమీద అనుమానం?

హను:- అందరి మీద. ఊళ్ళో వాళ్ళందరిని అరెస్టు చేయండి. తెలుతుంది.

## రెండవ రంగము

(హనుమంతయ్యా, జగ్గయ్యా, ఇనస్పెక్టరు)

(జగ్గయ్య ప్రవేశిస్తూ)

జగ్గ:- (లోపలనుంచి తాను వచ్చిన గుమ్మంవైపు తిరిగిచూస్తూ) వాటి పొట్ట చీల్చి ఉప్పు కారం కూరుతూండండి. ఇప్పుడే వస్తాను.

హను:-ఎవరి పొట్టరా? దొంగపొట్టేనా?

జగ్గ:- కాదండి, కాకరకాయలు.

హను:-ఇరుగో ఇనస్పెక్టరుగారు! ఈయన దగ్గర కాకరకాయలు, సొరకాయలు పనికిరావు. జాగ్రత్తగా జవాబు చెప్పు.

ఇన:- జగ్గయ్యాతో నీవేం భయపడవద్దు. ఉన్నది ఉన్నట్టు చెప్పు. ఎవ్వరికి తెలియనియ్యను.

జగ్గ:- వీరుకూడా భోజనాని కుంటారాండి?

హను:-భోజనం సంగతి కాదోయ్ వెధవాయ్? ఆయన అడిగే వాటికి జవాబు చెప్పు ముందు.

జగ్గ:- మీ డబ్బెవరన్నా యెత్తుకుపోయినారా యేమిటి?

హను:-అవును. యెత్తుకుపోయిన డబ్బు యివ్వకపోయినావంటే నిన్ను చంపుతా.

ఇన:- (హనుమంతయ్యాతో) ఎందుకండి వీడిని అంత మాట లంటారు. దొంగలాగ కనబడటం లేదే. మంచివాడిలాగే

చారుమతిని, నన్ను పెళ్ళి చేసుకోనిస్తావంటే ఆపెట్టె నీకొస్తుంది.

హను:-ఎక్కడుంది, ఎక్కడుంది?

చక్ర:- నీకేంభయంలేదు. జాగ్రత్తగా ఉంది. నాదీ జవాబుదారీ. తెలిసిందా. మిగిలినది నీమీద ఉన్నది. చారుమతిని నన్ను పెళ్ళి చేసుకోనియ్యకపోతే మాత్రం నీపెట్టె రాదు.

హను:-దానిలోంచి యేమీ పోలేదుగదా.

చక్ర:- ఒక్క దమ్మిడీ తక్కువ అయితే నన్నడుగు. చెప్పు మరి త్వరగా. చారుమతిని చేసుకోనిస్తావా? చారుమతి అమ్మగారు కూడ ఒప్పుకున్నారు.

చారు:-(చక్రపాణితో) మా అమ్మ ఒప్పుకుంటే చాలదు. యిప్పుడు దేవుడు మాకు మాతండ్రిని కూడా చూపించాడు. తండ్రినే కాదు అన్ననుకూడా. (అనంతయ్యను, సుదర్శనాన్ని చూపిస్తూ) వీళ్ళ అనుజ్ఞకూడా పొందాలి.

అనం:- భగవంతుడు నామీద యింత దయ తలిస్తే నే నీమాత్రమైనా చూపొద్దు మీకు? మీ యిష్టం యెల్లాగో అల్లాగే కానియ్యండి. హనుమంతయ్యగారు! పిల్లలు, యువకులను చేసుకోవా లనుకుంటారుగాని, తండ్రులను చేసుకోవా లనుకుంటారా? దయచేసి అడ్డం చెప్పకండి. రెండు పెళ్ళిళ్ళు జరిగితే కళ్లారా చూడొచ్చు.

హను:-ముందు నా పెట్టె చూసుకోనియ్యండి.

చక్ర:- చూసుకో. యెంత భద్రంగా ఉందో.

హను:-నా పిల్లలకు కట్నాలిచ్చి పెళ్లి చెయ్యడానికి నా దగ్గిర డబ్బు లేదు.

అనం:- మీరేమి విచారపడక్కరలేదు. నాకేదో కొద్దిగా ఉంది. ఆదిస్తాలెండి వాళ్లకు.

హాను:-రెండు పెళ్లిళ్లకూ ఉభయఖర్చులూ మీరే పెడతారా?

అనం:- అలాగే పెడతాను. సరేనా?

హాను:-పెళ్లికి తగిన గుడ్డల్లేవే నాకు!

అనం:- నేనున్నానుగా. పోదాం రాండి. యీరోజు వైభవంగా చెయ్యాలి.

ఇనస్పెక్టరు:-ఇందాకటినుంచి ఈ గొడవంతా రాస్తున్నాను. నా మాటేమిటి?

హాను:-ఎవ్వరాయమన్నారు నిన్ను? నీవే రాసుకున్నావు.

ఇన:- ఊరికే రాశానంటూరా?

హాను:-(జగ్గయ్యని చూపుతూ) మీరు పడ్డ కష్టానికి, యిదుగో, యీ వెధవను మీకు అప్పగిస్తున్నా. మీ యిష్టం వచ్చినట్లు చెయ్యండి వాడిని.

జగ్గ:- నిజం చెప్పినప్పుడు దెబ్బలే! అబద్ధం చెప్పినా దెబ్బలే! నా కర్మం!

అనం:- యీ మాటుకు క్షమించండి వాణ్ణి.

హాను:-ఇనస్పెక్టరుగారికి ఆ మామూలేదో మీరిస్తారా?

అనం:- అలాగే ఇస్తాలెండి. రండి నాయనా. త్వరగా యింటికి పోయి మీ అమ్మను చూద్దాం. ఆమె యెంత సంబరపడుతుందో.

హాను:-సంబరమే మరి! నాకూ సంబరమే. నా పెట్టె నాకు దొరికింది.

(స మా ప్త ము)

కళా:- చూచినట్టు లేదుగాని చెప్పవలసిందంతా చెప్పాను. మిమ్మల్ని చేసుకుంటే ఉండే లాభం యెంతో నచ్చేటట్టు చెప్పాను.

హను:-కళావతీ! నాకెంతో ఉపకారం చేశావు. నీ ఋణ మెట్లా తీర్చుకోను ?

కళా:- నాదో చిన్న మనవున్నది. నాకో వ్యాజ్యం ఉంది. నేనందులోనుంచి బయట పడాలంటే కొంచెం డబ్బు కావాలి. (హనుమంతయ్య తీవ్రంగా చూచును) నాకీ సాయం చేశారా, మీకీ సంబంధం అయ్యేటట్టు చూస్తాను. మిమ్మల్ని చూస్తే ఆ పిల్ల యెంత సంతోషిస్తుందో! (హనుమంతయ్య సంతోషం కనబరచును)

హను:-నీవా మాట చెపితే నాకానందం కలుగుతోంది.

కళా:- నా చావు బతుకులు యీ దావా మీద ఉన్నాయండి. ఇది పోయిందా నా కింక ఆధారం లేదు. కొంచెం సాయం చేస్తే బయట పడతా.—మిమ్మల్ని గురించి మాట్లాడుతూంటే యెంత పొంగిపోతూ వినేదంటారు! (హనుమంతయ్య సంతోషం కనబరచును) మీ గుణాలు చెప్పుతుంటే ఆ పిల్లపడే ఆనందం ఇంత అంత కాదు. మీకు పెళ్లి అయిందనే అనుకోండి.

హను:-నీవు చేసిన మేలు యింతంత గాదు. ఎన్నడు మరిచిపోను.

హాను:-నాకూ అర్థంకాదు. ఏముంది వాళ్లల్లో, వాళ్ల మొహం.

కళా:- మా ఆడవాళ్లున్నారే ఉత్త తెలివిలేని వాళ్లు. పడుచు వాళ్లు, పడుచువాళ్లని కలవరిస్తారు. మొగవాడంటే ముదిరి ముగ్గినవాడే మొగవాడు.

హాను:-నేననేదే అది ప్రతిరోజు. గడ్డాలా, మీసాలా, మాటలో గాంభీర్యమా; నున్నని గడ్డాలు, ఆడ గొంతుకలు! యేముంది కుర్రకుంకలదగ్గర.

కళా:- ఆడది మెచ్చాలంటే అచ్చంగా మీలాగే ఉండాలి.

హాను:-అయితే, కళావతి! నన్ను మెచ్చుకున్నావన్నమాటేనా?

కళా:- మెచ్చుకున్నానని మెల్లిగా అంటారేం. మీ వంటి దివ్య సుందర విగ్రహం కంచు నాగడాలు పెట్టి వెతికితే మాత్రం యేది! కొంచెం తలటు తిప్పండి. ఆఁ, నే నను కున్నట్టే ఉన్నది. కొద్దిగా నడవండి చూద్దాం. ఆ శరీరానికి తగిన నడక. పట్టి పట్టి నడుస్తారు కొందరు. మీది ధారాళంగా ఉంది. జబ్బు గిబ్బులేకుండా రాయిలా, ఉక్కు గునపంలా ఉన్నారు.

హాను:-జబ్బేంలేదు, ఎప్పుడైనా కొంచెం దగ్గు తప్ప.

కళా:- దానికేం. మీరు దగ్గుతున్నా బాగానే ఉంటుంది

హాను:-సరేగాని, ఆ అమ్మాయి నన్నెప్పుడైనా చూచిందా రోడ్డుమీద పోతుంటే.

ఉన్నాడు. (జగ్గయ్యతో) ఎక్కడ పెట్టావో చెప్పు. నీకేం భయంలేదు. ఆయన డబ్బు పోతే నీకు తెలియకుండా వుంటుందా.

జగ్గ:- (తనలో) మంచి సమయం దొరికింది. వాడిమీద చెప్పేస్తే నాకసి తీరుతుంది. నన్ను కొడతాడూ! ఇప్పటికీ జ్ఞాపకం ఉన్నాయి ఆ దెబ్బలు.

హాను:-ఏమిట్రా గొణుగుతున్నావు ?

ఇన:— వాడిజోలి కెళ్లకండి. నా కొదిలెయ్యండి. మంచివాడు. ఏదో చెప్పబోతుంటే అడ్డం వస్తారేం ?

జగ్గ:— ఉన్నదున్నట్లు చెప్పాలంటే బాబు, సుదర్శనం తీశాడండి.

హాను:-సుదర్శనమా ?

జగ్గ:— అవును.

హాను:-మంచివాడనుకున్నానే.

జగ్గ:— సుదర్శనమే కాజేశాడనుకొంటానండీ.

హాను:-నీవెలా అనుకున్నావు ?

జగ్గ:— ఎల్లాగా ?

హాను:-అవును.

జగ్గ:— ఎల్లాగా ? అనుకున్నాను, గనుక అనుకున్నాను.

ఇన:— అదిగాదోయ్. నీవేదైనా చూస్తే చెప్పాలి. తీస్తుండగా చూశావా ?

హాను:-నేను దాచినచోట తారట్లాడుతున్నాడా ?

జగ్గ:— ఆ! ఎక్కడ పెట్టారు డబ్బు ?

హను:-తోటలో.

జగ్గ:— అక్కడే నేను వాడిని చూసింది. డబ్బు యెందులో వుంది చెప్పండి ?

హను:—పెట్టెలో.

జగ్గ:— ఆఁ అదే. వాడి చేతిలో ఆ పెట్టె చూశాను.

హను:-నీవు చూసిన పెట్టె యెటువంటిది చెప్పు ?

జగ్గ:— ఎటువంటిదా

హను:-అవును. ఎటువంటిది ?

జగ్గ:— అదా......అదొక పెట్టె.

ఇన:— దాని గుర్తులు చెప్పు.

జగ్గ:— కొంచెం పెద్దదండి, ఆ పెట్టె.

హను:-పోయిన పెట్టె చిన్నదే.

జగ్గ:— చిన్నదైతే కావచ్చు బాబు. నేను కొంచెం పెద్దదను కున్నాను.

ఇన:— దాని రంగేమిటి ?

జగ్గ:— రంగా బాబూ ?

ఇన:— ఊఁ రంగే.

జగ్గ:—దాని రంగా......కొంచెం చెప్పండి. దాని రంగేదో చూద్దాం. ఎరుపా ?

హను:-నలుపు.

జగ్గ:- అవును బాబు, ఎరుపు నలుపు మధ్యగా వుంది.

హను:-ఇంకేమి అనుమానంలేదు. అది నా పెట్టే. వాడు చెప్పింది రాసుకోండి ఇనస్పెక్టరుగారు. ఎవర్ని నమ్మలేము.

జగ్గ:- (హనుమంతయ్యతో) అడుగో సుదర్శనం వస్తున్నాడు. నేను చెప్పానని చెప్పకండి, మీ పుణ్యం.

## మూడవ రంగము

(హనుమంతయ్య, సుదర్శనం, జగ్గయ్య, ఇనస్పెక్టరు)

(సుదర్శనం వస్తూంటాడు)

హను:-రా, యిటు. నీవు చేసిన పాడుపని యేదో చెప్పు.

సుద:- ఏం చెప్పమంటారు ?

హను:-చేసిందానికి సిగ్గయినా లేదే.

సుద:- నేనేం చేశాను?

హను:-ఏంచేశావా? చెయ్యరాని పని చేశావు. ఎరగనట్టు నటిస్తావేం? దాచి లాభంలేదు. నిన్ను యెంత దయగా చూసాను. ఇంట్లో యెంత స్వేచ్ఛ యిచ్చాను. చివరకు ఇల్లాగేనా చేసేది; ద్రోహం!

సుద:- మీకు అంతా తెలిసినట్టుంది గనక, కాదంటే యేం ప్రయోజనం, అవును.

జగ్గ:- (తనలో) నేను చెప్పింది నిజంగా నిజమేనేమో.

సుద:- ఆసంగతి నేనే చెప్పుదా మనుకుంటున్నాను. సమయం దొరకక చెప్పలేదు. యింతవరకు కోపం తెచ్చుకోకుండా, నేనే ఉద్దేశంతో చేరానో కొంచెం ఆలోచించండి.

హాను:-ఉద్దేశ మేమిట్రా దొంగతనానికి.

సుద:- అంత కఠినమైన మాటలనకండి. అపచారం చేశానని ఒప్పుకుంటూనే ఉన్నాను. క్షమింపదగిన తప్పే చేశాను గాని, యింకొకటేమి చేయలేదే.

హాను:-క్షమించేదా?— నీవు చేసిన పని.

సుద:- కొద్దిగా కనికరించండి...నే చెప్పేది విని, తరువాత అనండి.

హాను:-ఎంత ఘోరమైన పని చేశావు! నా ప్రాణం హరించావే.

సుద:- మీ ప్రాణం దుర్మార్గుల చేతులలో మాత్రం పడలేదు. నేను గొప్పఇంటి బిడ్డను. మీరు భయపడక్కర్లేదు.

హాను:-నే ననేది అదే. ముందు నువ్వు అపహరించిందంతా నాకు అప్పగించు.

సుద:- మీ గౌరవానికి లోపం లేకుండా చేస్తానుగా.

హాను:-గౌరవ మేమిటి నీమొహం. అసలు ఇలాంటి పని చెయ్యమని ఎవరు చెప్పారూ అంట!

సుద:- వేరే నన్నడగాలా?

హాను:-అడగాలి గనుకనే అడుగుతున్నా.

సుద:— మోహాం పట్టలేకపోయినాను.

హాను:-మోహామా ?

సుద:— అవును.

హాను:-బంగారమంటే మోహాంగాదు!

సుద:— అయ్యా, మీ బంగారాని కాశపడి ఆ పని నేను చెయ్య లేదు. నేను సంపాదించుకున్న బంగారం నాకు వదిలి పెడితే, మీ ఆస్తి నాకేమీ అక్కరలేదు.

హాను:-చూడండి, చేసిన దొంగతనం చాలక వాడెంత పొగరు బోతుతనంగా మాట్లాడుతున్నాడో. వాడు సంపా దించిందట. వాడికి వదిలివెయ్యాలిట. చూస్తానుగా.

సుద:— దొంగతనమంటారా దానిని ?

హాను:-దొంగతనం కాదు,దోపిడి. సరేనా? ఎటువంటి నిక్షేపం...

సుద:— నిక్షేపమే. అందులో సందేహాం లేదు. మీ సంపదను మించిన సంపద. కాని, నాకిస్తే మీకేం లోపం ఉండదు. మీ చేతులు రెండు పట్టుకొని ప్రార్థిస్తున్నాను. నన్ను అనుగ్రహించండి.

హాను:-నేను వినను.

సుద:— మేమిద్దరం, బతికినన్నాళ్లు ఎడబాటులేకుండా ఉందామని ప్రమాణాలు చేసుకున్నాము.

హాను:-ప్రమాణాలేమిటి? వింతగా ఉందే!

హాను:-చూస్తానుగా ఎట్లా విడిపోకుండా వుంటారో?

సుద:- నా ప్రాణం వుండగా వదిలిపెట్టనులెండి.

హాను:-డబ్బుకు ప్రాణానికీ లంకె అంటూంటారు. ఇదేనేమో!

సుద:- మళ్ళీ ఒకసారి చెపుతున్నాను. మీ డబ్బు నాకక్కర్లేదు. మీ ఆస్తి నాకక్కర్లేదు. నేనెంత సదుద్దేశంతో ఉన్నానో మీకు తెలియదు.

హాను:-నా బంగారాన్ని కాజెయ్యడం సదుద్దేశ మంటావా? ఇదుగో చూడు. నువ్వు చూసి చూసి వదిలిపెట్టలేకపోతే వదిలేటట్టు చేస్తాను.

సుద:- మీ చిత్తంవచ్చినట్లు చెయ్యండి, మీరేంచేసినా పడతాను. ఒక్కటి మాత్రం చెప్తున్నాను. దయ ఉంచి వినండి. జరిగిన దానంతటికీ జవాబుదారి నాదేగాని, మీ అమ్మాయిది మటుకు కాదు.

హాను:-ఇది నీవు నాకు చెప్పాలా యేమిటి. నాకూతురు ఇటువంటి పాడు పనులు చేయదని నాకు తెలుసు. సరేకాని ఎక్కడకు తీసుకు వెళ్ళావో చెప్పు.

సుద:- నే నెక్కడకు తీసుకెళ్లలేదు. మీ ఇంట్లోనే ఉన్నది యింకా.

హాను:- (తనలో) అయ్యో నాబంగారం! (ప్రకాశంగా) నా ఇంట్లోనుంచి వెళ్ళిపోలేదూ?

సుద:- వెళ్ళలేదు.

హాను:-ఇంకొక్కమాట చెప్పు. దానితో నీ యిష్టము వచ్చినట్టల్లా ఆడలేదు గదా!

సుధ:- ఛాండోయ్! అల్లా చేసేవాడిని కాదు. పవిత్రమైన ప్రేమతో ఆరాధించుతున్నాను ఆమెను.

హాను:-(తనలో) డబ్బుతో పవిత్రమేమిటి, వీడి మొహాం కవిత్వాం!

సుధ:- అటువంటి పాడుబుద్ధి మా యింటా వంటా లేదు. నిజానికి మీ బంగారం కూడా భయస్తురాలు. ఎంతకీ పరువు కోసం ప్రాకులాడుతుంది.

హాను:-ఏమిటీ! నాబంగారం పరువుకోసం ప్రాకులాడుతూందా?

సుధ:- దానిని కండ్లారా చూస్తూ పరమానందం అనుభవించుతున్నాను. ఆ అందమైన కళ్ళు చూస్తూంటే, పాపపు ఆలోచనలు పుట్టవు.

హాను:-(తనలో) కండ్లంటాడేమిటి, పెట్టెకి. వలచిన ఆడపిల్లని గురించి మాట్లాడినట్లు మాట్లాడతాడేం ?

సుధ:- మా సంగతి యావత్తు కోటమ్మకు తెలుసు. నేను చెప్పే దాంట్లో అబద్ధం వుంటే ఆమె నడగండి.

హాను:-ఇందులో మా దాసీదికూడా నీతో యేకమైందీ ?

సుధ:- అవును. మేమిద్దరము యేకాంతంగా ఉండడం చూసింది. మేము చేసేది తప్పుకాదని గట్టిగా నమ్మకం తోచిన తరువాతనే, మీ అమ్మాయి ఒప్పుకుంది

హాను:-(తనలో) ఏమిటి వీడి వేలాపన? (ప్రకాశంగా) అమ్మాయి అమ్మాయి అంటావేమిటి అనవసరంగా.

సుధ:- బతిమాలగా బతిమాలగా ఎంతో కష్టంమీద ఒప్పుకునేటట్లు చేశానని చెప్పుతున్నా.

హాను:-ఏం చెయ్యడానికి ?

సుద:- పెండ్లి చేసుకోడానికి.

హాను:-నా కూతురు నిన్ను పెండ్లి చేసుకుంటానన్నదీ ?

సుద:- నేను ఆమెను అమితంగా ప్రేమిస్తున్నానని తెలుసుకున్న తరువాత.

హాను:-ఉన్నదిగాక, యీ కుంపటికూడా పెట్టావు భగవంతుడా నా నెత్తిన.

జగ్గ:- (ఇనస్పెక్టరుతో) రాయండి సార్, అదికూడా రాయండి.

హాను:-గోరుచుట్టుమీద రోకటిపోటు. (ఇనస్పెక్టరుతో) అయ్యా! వాడు చెప్పేది విన్నారుగా. అంతా రాసుకొని వాడి మీద దొంగతనానికి, పిల్లనెత్తుకొని పోవటానికి చూస్తున్నందుకు కలిపి కేసు పెట్టెయ్యండి.

జగ్గ:- దొంగతనానికి, పిల్ల నెత్తుకు పోయినందుకు.

సుద:—ఈ కేసులు నన్నేమి చేయలేవు. నే నెవరో నిజం తెలిస్తే...

## నాల్గవ రంగము

(హనుమంతయ్య, జగ్గయ్య, సుదర్శనం, ఇనస్పెక్టరు, సుందరి, చారుమతి, కళావతి)

హాను:-వచ్చావమ్మా, వచ్చావా. నా కడుపున చెడపుట్టావు. కొంపకు అప్రతిష్ట తెచ్చావు. ఇంట్లో నౌకరికి చేరి దొంగతనం చేసినవాడిమీదగా నీకు ప్రేమ ! వాడినా

పెండ్లి చేసుకుంటా ననడం. చూస్తారుగా యిద్దరు, ఏం చేస్తానో! (సుందరితో) నిన్ను గదిలో పెట్టి తాళం వేస్తా. (సుదర్శనంతో) నిన్ను ఖైదులో వేయిస్తా. చూడండి నా తడాఖా.

సుద:— నన్ను ఖైదులో వేసేది మీరు గాదు. వేసేవాళ్లు మంచి చెడ్డ విచారించకుండా వెయ్యరు.

హను:—నీకు అసలు జైలుకాదు. కొరడాదెబ్బలు కొట్టించాలి.

సుందరి:-(హనుమంతయ్య కాళ్లమీద పడి) ఇంత కఠినంగా ఉంటే యేలా నాన్నా? నామీద కొంచెం దయఉంచు. తండ్రివిగదా అంత తీవ్రంగా ఉంటే యేలా? ప్రథమ కోపం కాస్త చల్లారనీ. నెమ్మదిగా విచారించు. నీ కెవ రపకారము చేశారని అనుకుంటున్నావో ఆయన ఎవరో కొంచెం విచారించు. ఆయన నౌకరనుకుంటున్నావా? ఆయనే లేకపోతే, నేను బ్రతికి ఉండేదాన్ని కాదు. నన్ను సముద్రంలోనించి రక్షించింది ఆయనే. నీ కూతురుకి ప్రాణభిక్ష పెట్టింది ఆయనే.

హను:—నీవు చెప్పే మాటలతో నాకు సంబంధం లేదు. రక్షించి యీ పని చేసేదానికన్నా రక్షించకుండా ఉన్నా తీరి పోయేది.

సుం:— తండ్రివిగదా, కనికరం ఉంచు నాన్నా!

హను:—లేదు. తగిన ప్రాయశ్చిత్తం జరగవలసిందే.

— (... తో) ఏమిటి యీ గందరగోళం?

# ఐదవ రంగము

(అనంతయ్య, హనుమంతయ్య, సుందరి, చారుమతి, కళావతి, సుదర్శనం, ఇనస్పెక్టరు, జగ్గయ్య)

అనం:- ఏమిటి హనుమంతయ్యగారు, ఇలా ఉన్నారు? ప్రమాదం యేమి జరుగలేదు గదా.

హను:-ఏంచెప్పను అనంతయ్యగారు, నాఅంత నిర్భాగ్యుడు లేడు. మీరు వచ్చిన వ్యవహారం కొనసాగేటట్టు లేదు. నాడబ్బా కాజేశారు. నన్నా అపకీర్తి పాలుచేశారు. అడుగో ఆ దుర్మార్గుడు. (సుదర్శనాన్ని చూపిస్తూ) వాడే నాయింట్లో చేరి నాడబ్బు కాజేసి,మా పిల్ల బుద్ధికూడా పాడుచేశాడు.

సుద:- డబ్బు, డబ్బు అంటారేమిటి! నాకు మీ డబ్బు ఏంగతేం తెలుసు?

హను:-వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుంటామని ప్రమాణం చేసుకున్నారుట. మీకింతకంటె అవమానం ఉండదు. గనుక మీరే వీడిని దండించే ఉపాయం చూడండి.

అనం:- ఇష్టంలేనివారిని బలవంత పెట్టడం నా స్వభావం కాదు. దానికేం పోనియ్యండి. రెండో విషయమన్నారో, నా సాధ్యమైన సహాయం చేస్తాను.

హను:-ఇదుగో ఇనస్పెక్టరుగారు, కేసంతా విచారించేశారు. (ఇనస్పెక్టరుగారితో) కానీండి. ఇక ఏంచేస్తారో చెయ్యండి వీడిని త్వరగా.

సుద:— నేనాయన కుమార్తెను ప్రేమించి పెళ్లాడితే నేరమాండి ? ఏమని కేసుపెడతారో చూస్తాగా. నేనెవరినో తెలిస్తే...

హను:— ఎవరినో, ఎవరినో అని ఎగురుతావేమిటి ? పైగా. ఇటువంటివాళ్లను చాలామందిని చూశాను. అంతవాళ్లం యింతవాళ్లం అని చెప్పుకుంటారు. అంతా గొప్పింట పుట్టినవాళ్లే.

సుద:— లేనిపోనివి చెప్పుకోడానికి నాకేమిగతిపట్టాలా! మా పేరు చెప్పితే సుందరపురంలో అంతా నెత్తిన పెట్టుకుంటారు.

అనం:- జాగ్రత్త, జాగ్రత్త, సుందరపురాన్ని ఎరిగినవాళ్లు ఇక్కడ ఉన్నారు. నోటికొచ్చినట్టు మాట్లాడితే యేలా ?

సుద:— ఉంటే మరీ సంతోషం. అయితే, ఆ ఊళ్లో జమీందారు ఆదిశేషయ్యగారి పేరు విన్నారా ?

అనం:- ఓ. తెలుసు. ఆయనను నే నెరిగిఉన్నంత బాగా యెవరు యెరుగరు.

హను:-ఆదిశేషయ్యగానీ, అన్నపూర్ణయ్యగానీ నాకు ఒరిగిందేమీ లేదు. (రెండు కొవ్వొత్తులు వెలుగుతుంటే ఒకటి ఊదేస్తాడు)

అనం:- కానియ్యండి. నన్ను మాట్లాడనియ్యండి, ఏమంటాడో చూద్దాం.

సుద:— ఆయన కొడుకును నేను.

అనం:- ఆయన కొడుకువా ?

సుద:— అవును.

అనం:- చాలు, చాలు. నమ్మడానికి వీలైనదేదైనా ఇంకోకథ అల్లుకో. దగా చేద్దామని చూడకు.

సుద:- దగా చేయడానికి నాకేం కర్మం. చేస్తే లాభం యేముంది నాకు. ఋజువు చెయ్యామంటే చేస్తాను.

అనం:- జమీందారు ఆదిశేషయ్యగారి కొడుకునని చెప్పుకుంటున్నావన్నమాట ?

సుద:- నిరభ్యంతరంగా. కాదనేవాళ్లెవరో రమ్మనండి.

అనం:- నీ పొగరుబోతుతనం భూమిన పట్టకుండా వుందే! చెప్తున్నా విను! పదహారేళ్లకింద సుందరపురంనించి యాత్రలకు బయలుదేరి ఆయన, ఆయన భార్య, పిల్లలు పడవలో వెళ్లుతుంటే పెద్ద తుపాను వచ్చి అందరు గంగపాలై పోయారు.

సుద:- తరువాత కథ వినండి. అయితే అప్పటికి ఏడేండ్ల కుర్రవాడైన ఆయన కొడుకును యింకొక పడవవాళ్లు కాపాడారు. ఆ రక్షించబడ్డ కొడుకే యిప్పుడు మీతో మాట్లాడేది. ఆ పడవ యజమాని నామీద జాలి కలిగి నన్ను కన్నకొడుకులా.పెంచాడు. చదువు చెప్పించాడు. మా తండ్రి సముద్రంలో మరణించాడని యిన్నాళ్ళు అనుకుంటూ ఉండేవాణ్ణి. యీమధ్య ఆయన బతికిఉన్నారని విన్నాను. ఆయన్ని గురించి వాకబు చేస్తూ వస్తుంటే అక్కడ మరిఒక ప్రమాదం జరిగి యీ దివ్య సుందరిని చూడగలిగాను. దైవ ఘటన. అప్పటినుంచి ఆమెను విడిచి ఉండలేక, ఈ వేషం వేసుకుని యీ యింటో

నౌకరుగా ప్రవేశించాను. మా తండ్రిని వెదకడం మాత్రం మానలేదు.

**అనం:**- నీవు చెప్పిన కథ నిజం అని యెలా నమ్మడం! నిదర్శనం యేమైనా ఉందా?

సుద:- ఆ ఓడ యజమాని, మా తండ్రి ఉంగరం, మా అమ్మ చేతికి పెట్టుకునే కడియం, నాతోపాటు బయటపడ్డ మా నౌకరు పిచ్చయ్య-ఇంతకన్న నిదర్శనాలు ఏం కావాలి?

చారుమతి:-ఇవి అన్ని వింటుంటే, మా అన్నయ్యలాగ ఉన్నాడే!

సుద:- నా చెల్లెలువా అమ్మా?

చారు:-అవును. నిన్ను చూచినప్పటినుంచి, ఏమిటో అదొక విధంగా ఉంది నా మనసు. మన అమ్మ ఈ కథ, మనం పడ్డ కష్టాలు యెన్ని వేలసార్లో చెప్పింది. నిన్ను చూస్తే ఆమె సంతోషం పట్టలేదు. దేవుడి దయవల్ల మేముకూడా బయటపడ్డాం. కాని, దొంగల చేతుల్లో పడ్డాం. పదేళ్లు గడిచిన తరువాత, మా అదృష్టంకొద్దీ తప్పించుకున్నాం. తప్పించుకొని మనదేశం వెళ్లాము. ఇల్లు వాకిలి ధ్వంసం అయిపోయినయి. అక్కడ ఆదరించేవారు ఎవరు లేక నానా యిబ్బందులు పడి యిక్కడకు చేరాం. అమ్మ ఆబెంగతో మంచానపడి, రోజులు యీడుస్తున్నది. పాపం!

అనం:- ఏమి అద్భుతం! ఎంత దయామయుడవు? భగవంతుడా! రా నాయనా, రాతల్లీ! నన్ను కౌగలించుకోండి, నేనే మీతండ్రిని.

సుద:- మీరా మాతండ్రి.

చారు:-మీకోసమేనా మా అమ్మ అస్తమానం విలపించడం?

అనం:- అవును తాత్లీ!—అవును నాయనా! నేనే ఆదిశేషయ్యను. నేను కూడా దైవయోగంవల్ల బయటపడ్డాను. డబ్బుతో కూడా బయటపడ్డాను. మీరు ఎక్కడయినా కనబడతారా అని ఇంతకాలం వెదికాను. చివరకు నిరాశతో మళ్ళీ పెళ్ళి చేసుకొని కొత్తజీవితం ప్రారంభించాలని యోగ్యురాలైన బాలిక కోసం వెతుకుతున్నా. సుందరపురంలో ఉన్న ఆస్తి అంతా అమ్మి యిక్కడే ఉండిపోయి నా పేరు కూడా మార్చుకున్నాను.

హను:-(అనంతయ్యతో) ఏమిటీ? యీాయన మీకుమారుడుటండీ!

అనం:- అవును.

హను:-అయితే సరే! యీాయన కాజేసిన పదివేల రూపాయిలకు మీదే జవాబుదారీ!

అనం:- మీ సొమ్ము కాజేశాడా?

సుద:- ఎవరు చెప్పింది?

హను:-జగ్గయ్య.

సుద:- (జగ్గయ్యతో) నువ్వేనా చెప్పింది?

జగ్గ:- ఇదుగో చూడండి! నిజంగా నాకేం తెలియదు.

హను:-ఇనస్పెక్టరుగారు రాసుకున్నారు. జగ్గయ్య చెప్పిందంతా.

సుద:- నేనలాంటి నీచపు పని చేస్తా ననుకున్నా రా?

హను:-నాకు తెలియదదంతా! నాసొమ్ము నాకియ్యి.

## ఆరవ రంగము

(చక్రపాణి, లక్ష్మయ్య, హనుమంతయ్య, అనంతయ్య, సుందరి, చారుమతి, సుదర్శనం, కళావతి, ఇనస్పెక్టరు, జగ్గయ్య)

చక్ర:- నీకొచ్చిన తొందరేంలేదు నాన్న. ఊరికే అందరిమీద అనుమానపడకు. నీపెట్టె ఎక్కడుందో నాకు తెలిసిందిలే.